# సినిమా చరిత్ర

సినిమా ఎలా తీస్తారు? శబ్దగ్రహణం
ఎలా చేస్తారు? డైరెక్షన్ చేయడం ఎలా? నటీనటులు
ఇంత చక్కగా నటించడానికి తెరవెనుక జరిగే తతంగం
ఏమిటి? ఔట్ డోర్ షూటింగ్ ఎలా తీస్తారు? సముద్రంలో
నడిచేటట్లు నారదుడు ఆకాశంలో ప్రయాణం చేసే
టట్లు మొదలైన ట్రిక్ షాట్లు ఎలా తీస్తారు? ద్విపాత్రాభి
నయం త్రిపాత్రాభినయం చిత్రీకరించడం ఎలా?
మీరు నటీనటులు కావాలంటే సినిమా రంగంలోకి ప్రవే
శించాలంటే మీరేం చేయాలి? చిత్రం విజయవంతంగా
నడవడానికి కావలసిన టెక్నిక్కులు ఏమిటి? ఇంకెన్నో
విషయాలు మీకు మూడువందల పేజీలలో ముచ్చటైన
త్రివర్ణ చిత్రములతో అత్యంత ఆకర్షణీయంగా ఎ
ప్పటికీ ఉపయోగపడే మా సినిమా చరిత్ర రూ.5-00లకే
లభిస్తుంది. వి.పి.పి. పద్ధతి లేదు. ముందు రూ.5-00లు
పంపిన వారికే రిజిష్టరు పోస్టుద్వారా కాపీలు పంపగలము.

కాపీలకు:
**జి. బలరామరెడ్డి**
47 నార్తుఉస్మాన్ రోడ్డు
మద్రాసు 17.

# తొలిమాట

చీఫ్ మేజిస్ట్రేట్‌నుండి డిక్లరేషన్ పొందడంలోనూ, రిజిస్ట్రరు నెంబరు రావడంలోనూ జరిగిన జాప్యంవల్ల ఈ సంచికను సకాలంలో అందించలేకపోయాము.

పత్రికను క్రమం తప్పకుండా సర్వాంగ సుందరంగా వెలువరించాలనుకోవడంవల్ల అన్ని హంగులు సమకూర్చుకోటానికి కాస్త కాలం పట్టొచ్చు. జూలైసంచిక కూడా కొద్దిగా ఆలస్యంగా వెలువడుతుంది.

ఆ తరువాత సంచికనుండి సకాలంలోనే అందించగలమని హామీఇస్తున్నాము.

• • •

మే సంచికలో ప్రచురించిన "పీతిచంద్రిక"ను విమర్శిస్తూ పాఠకులు ఉత్తరాలు వ్రాశారు. ఆ ఉత్తరాలన్నీ ప్రచురించితే ఉత్తరాల ప్రత్యేక సంచిక అవుతుంది.

• • •

గాలిబ్ ఉత్తరాలకు శ్రీమతి లతగారి అనువాదాలు ఈ సంచికలో ప్రారంభించాం.



సచిత్ర మాస పత్రిక
41, బి. బర్కిట్ రోడ్,
టి. నగర్. మద్రాసు-17.

విడి ప్రతి వెల
1 రూపాయి

ఏడాది చందా
పన్నెండు రూపాయలు

సంపుటి 8
జూన్ 1970
సంచిక 6

మేనేజింగ్ ఎడిటర్:
వి. వి. రాఘవయ్య.



ముఖచిత్రం:
టి. పి. యస్. పిక్చర్స్
"జన్మ భూమి"లో
దృశ్యాలు

Edited and Published by V. V. Raghavaiah and Printed by K. Domodaram at Sri Kala-Printers, 83, Lake view Road, Madras-33.

## చూడండి, మీకే తెలుస్తుంది...
# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !

ఫలితములను చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునపుడు కొంచెము టినోపాల్ వేయండి అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి! దానికయే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి, రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్టీకి సరిపోయే ప్యాకెట్టును — మూడు ప్యాకింగులలో లభిస్తోంది.






® టినోపాల్ జె. ఆర్. గైగీ ఎస్. ఏ. వారి స్విట్జర్లెండు వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగీ లిమిటెడ్,
పి.ఒ. బాక్స్ 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi SGT-1A/69 Tel




మగవాడు మగువపట్ల ఎంతటి గౌరవాన్ని చూపుతాడో తెలియపరుస్తుంది కథానిక (హరిప్రియ)

భార్యాభర్తల సామరస్యాల ఫలితంగా స్వీట్ హోమ్ ఏర్పడక తప్పదు. కాని కథాంతానికి రచయిత్రిగారు పొరబడ్డారు.

నేను ధన్యుణ్ని ప్రియా! మిల మిల లాడే కళ్ళతో భార్య వంక చూచాడు.

పీతి చంద్రిక కథానిక చదివేకొద్దీ అసహ్యం వేస్తున్నది. అసహజంగా ఉంది.

గోపాలం (మరిది) సుమతి (వదిన) ప్రబుద్ధులే అయితే తమపై ఎన్ని నిందలు వచ్చినా సహించేవారు. చివరికి చచ్చేవారు అంతేగాని నింద ప్రకారమే నడచుకొంటారా (రచయిత దృష్టిలో వదినా మరుదులు ప్రబుద్ధులు).

ఈ కథానిక నేను, మా ఆయన చదివాం. వయసు వచ్చిన మరిదీ చదివాడు. నేనెలా ధైర్యంతో మరిది ముఖంలోకి చూడగల్గను చెప్పండి? మా ఆయన మస్తిష్కంలో ఏలాటి భావనలు చెలరేగుతాయో వూహించండి!

—తార
హైద్రాబాద్-2

ఆర్యా! జ్యోతి అభిప్రాయ వేదికలో ప్రచురింపబడే ఉత్తరములను చాలా నిశితంగా గ్రహించి, నవరసాలుగాని, ప్రకంపనలుగాని ఒక రీతిగా వేసికొంటారనే నమ్మకంతో నేను ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. ఈ నెల (మే) జ్యోతిలో ప్రచురించిన 'పీతి చంద్రిక' అనే కథ చదవడం జరిగింది. సదరు కథ మధ్యలో ఉద్వేగం కల్గించినా సమాప్తిలో చక్కని సానుభూతి సంపాదించుకుంటాయని ఆశించాను. కాని ఆ కథ ముగింపు చాలా అవహాస్యంగానూ, మన హిందూ ధర్మానికి గొడ్డలిపెట్టుగానూ మారిందని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను. మనిషి యొక్క వయస్సు, వ్యామోహాన్ని చిత్రించటానికి, రచయితకు ఆ మూడు పవిత్ర పాత్రలే కన్పించాయా? ఇంక ఏ పాత్రలూ కన్పించలేదా? అసలు అటువంటి రచన సాగించడం ఏమంత సబబుగా లేదు.

అనాదిలోనైనా, ఆధునిక ప్రపంచంలోనయినా వదిన స్థానం ఉన్నతంగానే ఉన్నది. ఉంటుంది కూడా! ఇకపైన దయచేసి, అటువంటి రచనలకు ప్రోత్సాహ

మివ్వవద్దని. అనేక పాఠకులలో నేనొక డిగా కోరుకుంటున్నాను.

కె. వి. సన్యాసి నాయుడు
విశాఖ.

మే "జ్యోతి"లో ప్రచురింపబడిన మాదిరెడ్డి సులోచనగారు వ్రాసిన "హరి ప్రియ" చాలా బాగుంది. ముగింపు చాలా వేర్పుగా ఎంతో బాగుంది. ప్రకృతిలో స్త్రీలవల్ల పురుషునికి, పురుషునివల్ల స్త్రీలకి కష్టసుఖాలు వున్నాయి అని వ్రాశారు. ఇది ముమ్మాటికి నిజం రచయిత్రిగారు! మీకు నా ధన్యవాదాలు.

గాంధీజీ
హైద్రాబాద్

మే" జ్యోతి"లో ప్రచురించిన కథ లలో శ్రీమతి విజయలక్ష్మిగారు రచించిన "కానుక" కథ. శ్రీ అందె గోపాల కృష్ణగారు రచించిన "విషం" కథ చాలా బాగున్నాయి. "వదికిరాని పరిజ్ఞానం" "కార్టూన్లు" "జ్యోతి" ముఖ్యంగా అందం చేకూర్చినవి. యద్దనపూడి సులో చనారాణి వ్రాస్తున్న "అకల శిఖరాలు" చాలా బాగుంది. జ్యోతి కార్యాలయం మద్రాసుకు మార్చినందుకు నా అభి వందనలు.

వి. కామేశ్వరగుప్త
అనకాపల్లి.

మే నెల జ్యోతిలో డా॥ పి. వా. రె. గారి 'మనసు విప్పితే తెలిసింది' కవిత చాలా బాగుంది. విషం కథ విషాదాన్ని కలిగించింది. 'కానుక' లాంటి కథ ఎప్పుడో చదివినట్లు గుర్తు. అదీగాక ఈ రకం కథలు చాలా వెలువడ్డాయి. 'హరి ప్రియ' కథ బాగుంది.

'ఎవరు మారాలి' వ్యాసంతో ప్రతి చిత్రం పట్టుమని పది వారాలు ఆడే యోగ్యత కలిగి వుంటే బాగుంటుం దన్నారు కానీ, ఈ రోజుల్లో ప్రతీ చిత్రం ముచ్చటగా ముప్పయి రోజులు ప్రదర్శింప బడడమే కష్టంగా వుంది. ఈ రకం వ్యాసాలు చదివి పాఠకులు విసుగెత్తిపో యుంటారు. ఇటువంటి వ్యాసాలు ప్రచు రించేబదులు, ఉత్తమ చిత్రాలు అంటే ఏమిటి? ఎలాగ నిర్మించాలి లాంటి వ్యాసాలు ప్రచురిస్తే మంచిదని నా అభి ప్రాయం.

ఎమ్. రామారావ్
బరంపురం-2.

మే నెల జ్యోతి చాలా ఆకర్షణీ యంగా వెలువడింది.

ప్రీతి చంద్రిక. హరిప్రియ కథలు చాలా బాగున్నవి. ఈ నెల పంచికలో జోక్సు చాలా తక్కువ వేశారు. 'అకల శిఖరాలు' సీరియల్ చదువుతున్నంతసేపు ఎంతో మంచి యింట్రస్టింగ్ కలుగు తోంది. యద్దనపూడి సులోచనా రాణిగారి కలం నుండి వెలువడిన ఈ సీరియల్ చాలా బావుంది. మీరనుకున్న విధం గానే ఈ నెల జ్యోతి చాలా ముందే వచ్చింది. హృదయపూర్వకాభివందనలతో.

యం. చంద్రశేఖర్ రెడ్డి
జమ్మలమడుగు.

# గాలిబ్ రాసిన ఉత్తరాలు

## 1

అగస్టు 1849.

హరీ మహరాజ్,

మీరు దయతో వ్రాసిన ఉత్తరం అందింది.... మనసులో పెద్ద సంతోషం లేకపోయినా సంతోషపడ్డాను. నా స్వభావం నన్ను వదలటంలేదు హరీ. ఛత్రాణి బహిరంగంగా ఇంకా మారలేదు. నా రచనలోని సౌందర్య దేవత ఛత్రాణికాలేదు. ముస్తాఫాఖాన్ లాగా పొగడమంటావా అందర్ని? మీర్జారహీముద్దీన్ బహదుర్ హయా (సిగ్గు) అతను వ్రాసిన ప్రతి భూమికలోనూ ఆఖరికి దివానే హాఫిజ్‌లో కూడా ఒక్క వాక్యంలో మాత్రం కవిని గురించి పొగిడి మిగతాదంతా తన్ని గురించే పొగుడుకున్నాడు. ఆఖరికి నేను భగవంతుడిని కూడా పొగడలేనుగదా ఒక మనిషిని పొగడగలనా!

అది వదిలిపెట్టు నేను నిన్ను పొగడినంత యింకెవరినీ పొగడలేను. నీవు మానవుడివి—నన్ను గురించి నా స్వభావం గురించి నీకు బాగా తెలుసు. ఇక్కడికే పొగడడమే ఎక్కువ. అక్కడికి నీ కోసం కొంచెం ఉద్దేశ్యం మార్చుకున్నాను. నువ్వు వూరికే రెచ్చిపోతావు. ఎవ్వరేమన్నా నీవు వినిపించుకోకు. కోకిల గీతాలు చెవిటి వాళ్ళకు వినిపించవు. అరిచి చప్పట్లు కొడితే బాగా కవిత్వం తెలుసునను కొనే కవిత్వ పిపాసువులు ఎక్కువయినారు ఈ మధ్య.

ముఫ్తీ సాహెబు జబ్బుకి ఏ మందు పనిచెయ్యదు. హాంపేన్‌ఘన్‌లో ఒక చిట్కా వుందిలే. అది ఆలస్యంగా పనిచేస్తుంది. నువ్వు త్రాగి చూడు.... నేను మానలేదు. నువ్వు కూడా దాహం అయినప్పుడల్లా త్రాగేస్తూ వుండు బాగుంటుంది. ఇల్లా నువ్వు త్రాగుతూ ఉంటే సంవత్సరం లోపలే గొప్పవాడివై పోతావు.

సాహెబ్‌జీకి సలాములు. ఉంటాను.

నీ.

గాలిబ్.

# 2

అగస్టు 1850.

భాయీహరీ!

నువ్వు వ్రాసిన కవిత చదివాను—బాగుంది. వ్రాసినవి నాలుగు వాక్యాలే అయినా చాలా బాగుంది. ఇక నువ్వు రెండో కవిత చెప్పనవసరం లేదు. నహ్వా! భాయీ నహ్వా! జహూరీ వ్రాసిన దిక్కుమాలిన పద్యంలో సందేహం వచ్చిందా? నరే ఆ హంగ్‌లో నేనా పదాన్ని పదివేల చోట్ల అనా వాడివుంటాను. అందుకే అఫర్ అనే పదం నువ్వనుకున్నంత గొప్పది కాదు. పర్షియన్ పద ప్రతిభ అటే ....గొప్ప పదం కాకపోయినా కూడా గొప్పగానే వుంటుంది.

ఇక పేరు పెట్టడంలో కొంచెం శ్రద్ధ కనుపించాలి. శాస్త్రీయంగా పేర్లు పెట్టాలనే సిద్ధాంతం ఇప్పుడేమీ కనుపించడం లేదు.

మహమ్మదలీఖాన్ అంటే చాలు—అదే బాగుంటుంది బస్—నామద్వయం పెట్టి జనాన్ని హడలగొట్టి ప్రయోజనం ఏమిటి? కాదు కావాలంటే మునీరుద్దౌలా మహమ్మదలీఖాన్ బహదూర్ క్షాకిత్ అని తగలెయ్యి. అప్పటికీ చాలదంటావా చిట్ట చివర ముక్క అది కూడా తగిలించు. నీకు వివరంగా తెలిసి వుంటుంది గదా నీ యిష్టం మరి—అవసరం అయితే దివాన్‌లో ప్రకటించుకో. ఈ ఉత్తరాన్ని మున్షీగారికి చూపించి అప్పుడే పంపిస్తే మంచిది. ఆ తరువాత అక్బార్‌లో ప్రకటిస్తే బాగుంటుంది. అది మున్షీ సాహెబ్ ఇష్టం. నువ్వు చెపితే అతను వేస్తాడు. నువ్వున్నప్పుడు నేను వ్రాయాలా ఇంకా?

నీ.
గాలిబ్.

# 3

అగస్టు 1851.

భాయీ!

నేను నీకు ఉత్తరం వ్రాశాను హరీ!! అందే ఉంటుంది. నిన్న ఒక ఉత్తరం వచ్చింది. ఒక పెద్దమనిషి నన్ను చూడడానికి వచ్చాడు. ఆయన పెద్ద కవి నన్నాడు....నేను ఆ పేరు వినడం ఆయనంటుండగానే గాని అదివరకు వినలేదు. నువ్వు కూడా ఆ పెద్దమనిషి కవిత్వం చదువుతావని పంపిస్తున్నాను.

ఇక నువ్వు వ్రాసిన కవిత్వం చిన్న దిద్దుబాట్లతో అది మంచి కవిత్వం అవుతుంది. అది కాపీ అనడానికి ఎవటికీ వీలులేదు. అలా లేదు కూడా.

నీ.
అసదుల్లా.

# ఆఖరి ఆకు

## కంఠంనేని రాధాకృష్ణమూర్తి

అన్ని నగరాల్లోలాగే ఆ నగరంలో కూడ ఇవన్నీ వున్నాయి: రైల్వే స్టేషనులు. పోలీసుస్టేషనులు ట్రెయినులు కారులు. రిక్షాలు. సైకిళ్ళు. భవనాలు పూరిళ్ళు. బొర్రలు పెంచిన ఆఫీసర్లు. బొచ్చు పెరిగిన జాతి కుక్కలు. కొళాయిలు. మురుగు కాలువలు. పోలీసులు. ముష్టివాళ్ళు. విద్యార్థులు. నేల టిక్కెట్టు ప్రేక్షకులు. పత్రికా ఆఫీసులు. వ్యభిచార గృహాలు. డాక్టర్లు రౌడీలు. సానులు. మంత్రసానులు. రాజకీయాల్లో పొర్లే నాయకులు. పెంటలు తినే పందులు. ఆర్టిస్టులు. బిచ్చగాళ్ళు. పతివ్రతలు. భూత వైద్యులు గ్రంథాలయాలు. దేవాలయాలు ఇల్లాంటివన్నీ...

కాని ఇవన్నీ అందరికీ అన్ని సమయాల్లోనూ అవసరపడవు. కొందరికి కొన్ని కొన్ని సమయాల్లోను. ఇంకొందరికి ఇంకొన్ని అన్ని సమయాల్లోనూ అవసరపడుతుండటం జరుగుతుంది. ఆ నగరంలో ఓ మూల మురికివాడలో ఒక పాత మిద్దె రెండో అంతస్థులో చౌకగా దొరికిన రెండు గదుల వాటా ఒకటి శారదకి. రజనీకి కలిసి అవసరమైంది.

శారద. రజనీలు. యిద్దరూ ఆర్టిస్టులు. జంట కవుల్లాంటి జంట ఆర్టిస్టులు. 'శారజ' అన్న పేరుతో బొమ్మలు గీస్తుంటారు. పెద్దగా పేరుగలవాళ్ళేమీ కాదుగాని ఆర్టిస్టులుగా ఏదో సాధించాలన్న తపన కలవాళ్ళు. శారద స్వగ్రామం తెనాలి. రజని స్వగ్రామం నెల్లూరు. సహజంగా ఇద్దరు ఆడవాళ్ళకు పొత్తు కుదరటం అసంభవం అంటారు. కాని ఒకోసారి అసంభవాలు సంభవాలుగా మారుతుంటాయి. ఆర్టు విషయంలోను వంకాయ పులుసు వంటకంలోను, డ్రాపరీ సెలెక్షన్‌లోను చీరకట్టు తీరులోను ఆ యిరువురి అభిరుచులూ ఏకం కావటం వల్ల వాళ్లిద్దరూ ఒకే ఇల్లు తీసుకోవటమూ, జాయింటుగా స్టూడియో స్థాపించటమూ, సంభవించింది. సాధ్యపడిందీను.

ఇదంతా ఉత్త ఉపోద్ఘాతం అనవచ్చు ఇక.

ఆ నవంబరు మాసంలో ఆ నగరంలో ఒక క్రొత్త వ్యక్తి ప్రవేశించాడు అతను అక్కడి సందుల్లోను. గొందుల్లోను మూల మూలల వెతుకుతూ ఇక్కడో మనిషిని. అక్కడో వ్యక్తినీ తన చల్లటి వ్రేళ్ళతో తాకుతూ తిరగటం ప్రారం

ళించారు. డాక్టర్లు అతన్ని 'న్యూమోనియా' అన్నారు. నగరపు తూర్పు వేపు ఇరుకు, మురికి, గొందుల గలీజుల్లో అతను తాను రొమ్ము విరుచుకుని తనకు 'ఎరగ' దొరికిన మనుషుల మీద తన చిహ్నాన్ని ముద్రిస్తూ చిన్నగ అడుగులువేస్తూ కదల సాగాడు.

ఈ 'న్యూమోనియా' అన్న పెద్ద మనిషి మీరనుకున్నంతటి సాహసికుడేమీ కాదు. దొక్కలంటుకు పోయి తిండిలేక చిక్కిన ఏ ఆర్థికాసమర్థుడైనా నిరుద్యోగ యువకుడో, లేక పిల్లల్ని కనీ కనీ రొమ్ములెండుకుని, రక్తలేమి వల్ల పాలి పోయి ఇష్టం లేకపోయినా తప్పని సరై భర్తకు శరీరాన్నర్పిస్తున్న ఏ అసహాయ యువతో చాలు అతని ప్రతాపానికి. కాని చిత్రమేమిటంటే అతను రజని మీద కూడ తన కొరడాను విదిలించటం! కదలలేక నులక మంచపు కుక్కి మధ్య పడుకుని ఎదురుగా కిటికీలో నుంచి అవతలి పెంకుటింటి ఆవరణలోకి చూస్తూ పడుకుని ఉందామె.

ఆ రోజు ఉదయం డాక్టరు శారదను మెట్ల మీదికి పిలిచాడు.

"మొత్తం ఛాన్సుల్ని పది క్రింద తీసుకుంటే." చేతిలోని ధర్మామీటరును విదిలించుతూ అన్నాడాయన. "మీమిత్రురాలికి ఇంకొక్క ఛాన్సు మాత్రం ఉంది. ఆ ఒక్క అవకాశం కూడా ఆమెకు జీవితం మీద ఉన్న ప్రేమను బట్టి ఆధార పడి ఉంటుంది. ఈ ఒక్క మార్గం ద్వారానే మనుషులు ఒకోసారి మెడిసన్‌ను హేళన చేస్తుంటారు. అసలు సంగతి చెప్పాలంటే మీమిత్రురాలు తనిక బ్రతకబోవటం లేదని నిశ్చయం చేసేసుకుంది సరేగాని, మనలో—మాట ఆమె మనసులో వేరే ఏదయినా ఉద్దేశముంటావా?"

"ఆమెకా?" ఆలోచనగా, అన్నది శారద. "అవును. ఏనాటికయినా హిమాలయాన్ని పెయింటు చేయాలని మాత్రం పెద్ద ఆశయముంది"

"చిత్ర లేఖనమా—ఛట్! అదికాదు నేననేది, రెండుసార్లు ఆలోచించ తగినంతటి విషయమేదైనా-మాట వరసకి ఎవరైనా యువకుడు?"

చిత్రంగా కళ్ళు పెద్దవి చేసి చూసింది శారద.

"ఏమిటి? ఒక యువకుడికి ఆ మాత్రం అర్హత - లేదు డాక్టర్ ఆమె విషయంలో అట్లాంటిదేమీ లేదు."

"సరే అయితే." డాక్టరు అన్నాడు. "అది బలహీనతల్లే ననుకుందాము. నా ప్రయత్నాల ద్వారా సైన్సు చేయగలిగిందంతా చేసి చూస్తాను. కాని ఒకటి నా పేషెంటు ఎవరైనా తన మరణం తర్వాత ఎంతమంది కన్నీళ్ళు కార్చేవారున్నారా అని యోచించటం ప్రారంభించిందని తెలిస్తేమాత్రం యాభయి శాతం ఆశ వదులుకుంటాను. కాక ఆమె ఏ సినిమాతార జుత్తు స్టైలును గురించో ఆలోచిస్తుందని తెలిస్తే, ఆమె కోలుకునే విషయంలో పదింటికి ఒకటి బదులు రెండు ఛాన్సుల్ని లెక్కలోకి తీసుకుంటాను."

డాక్టరు వెళ్ళిపోయాక శారద హాలులోకి నడిచింది. డ్రాయింగు బోర్డు తీసుకుని చిన్నగ కూనిరాగం తీస్తూ అవతలి

గదిలోకి వెళ్ళింది. ఆ గదిలో దుప్పటి క్రింద ఒక్క కదలికన్నా లేకుండా, మొహం కిటికీవేపు తిప్పుకుని రజని పడుకుని వుంది. ఆమె నిద్రపోతుందను కుని శారద తన తూవిరాగాన్ని కట్టిపెట్టేసింది.

టేబుల్ మీద బోర్డును వుంచి దాని కొక డ్రాయింగు కాగితాన్ని అమర్చి



బొమ్మ గీయటం ప్రారంభించింది ఆమె. ఒకటి రెండు వార పత్రికల్లో కథలకి కార్టూనులకి బొమ్మలు గీస్తుంటారువాళ్ళు.

బొమ్మ గీస్తున్న సమయాన ఒక స్వరం గొణుగుతున్నట్టుగా పదే పదే వినిపించటంతో శారద చప్పున మంచం వద్దకు నడిచింది.

రజని కళ్ళు రెండూ తెరుచుకుని వున్నాయి. కిటికీలోంచి బయటికి చూస్తూ ఆమె ఏమిటో లెక్క పెడుతోంది. వెనక వేపుకు.

"పన్నెండు." ఆమె నోట్లోంచి వెలువడింది. కొద్ది సేపయాక, 'పదకొండు'. ఆ తర్వాత, 'పది, తొమ్మిది.' వెంటనే 'ఎనిమిది, ఏడు.' ఇలా చివర్లోని త్వర త్వరగా చదివిందామె.

శారద సాలోచనగా కిటికీలోంచి బయటికి చూసింది. ఏమున్నాయక్కడ లెక్క పెట్టటానికి: ఈ మిద్దెకు అవతలివేపు ఒక ఇరవై గజాల ఖాళీస్థలం తర్వాత ఉన్న పెంకుటింట పెరటిలో గోడమీదికి పాకి పరుచుకుని ఉండు ద్రాక్షతీగ, దాని వయస్సెంతుంటుందో చెప్పలేము. ఎండిన తీగలతోదాదాపు ఒక అస్థిపంజరంలా కనిపిస్తోంది.

"ఏమిటి రజనీ?" అడిగింది శారద.

"అరు." రజనీ అన్నది గొణుగుడు స్వరంతో "ఇప్పుడవి తొందరగా పడి పోతున్నాయి. మూడు రోజుల క్రితం వంద దాకా ఉన్నాయి లెక్క పెట్టటానికి వచ్చేదావ్ని...ఇప్పుడయితే తేలిగ్గా ఉంటుంది. అదుగో యింకొకటి పడిపోయింది. ఇప్పుడింక అయిదు మాత్రం మిగిలాయి."

"ఏమిటే అవి? నాకు చెప్పవూ?"

"ఆకులు. ఆ ద్రాక్ష ఆకులు. ఆ ఆఖరి ఆకు రాలి పోయిందంటే ఇక నాకూ పిలుపొచ్చిందన్న మాట మూడు రోజుల్నించీ నాకీ సంగతి తెలుస్తోంది. డాక్టరు మట్టుకు చెప్పలేదా నీకు?"

"అట్లాంటి చెత్త నాకెప్పుడూ చెప్ప లేదు." కోపంతో శారద తీవ్రంగ అన్నది "ఏమిటి నువ్వనేది? ఆ ఆకులు రాలి పోవటానికి నువ్వు కోలుకోటానికి సంబంధమేమిటి? ఇంతకు మునుపు నువ్వా ద్రాక్షను ఎంత ఇదిగా ప్రేమించే దానివి? తెలివి తక్కువ ఆలోచనలేం పెట్టుకోకు. నిజానికి డాక్టరు కూడ ఏమన్నాడండే పది ఛాన్సులకి ఒక్క ఛాన్సు మాత్రం ఉందన్నాడు అయితే మట్టుకు? ఇన్ని కారులు అటు ఇటు దూసుకు పోతుంటే ఈ నగరపు రోడ్ల మీద గాని, లేక ఈ రోజుల్లో కొత్తగా నిర్మించిన ఒక భవనం పక్కనుంచిగాని నడుస్తున్నప్పటి జీవితావకాశాల కంటే ఇది ఎక్కువేనే! ఇంకేమీ మాట్లాడక, ఒక బేబీరెట్ వేసుకుని నిద్రపోవటానికి ప్రయత్నించు... నేను బొమ్మ పూర్తి చేస్తేనే గాని నా పొట్ట కూటికి, నీకు బ్రెడ్డుకి వాటికి కాస్త డబ్బులు దొరకవు...."

"ఇంక నాకు బ్రెడ్డూ వద్దు, పాడూ వద్దు," అన్నది రజని ఇంకా కిటికీవేపే దృష్టి వుంచి. "మళ్ళీ ఇంకొకటి పడింది. ...లేదు నాకింకే బ్రెడ్డూ, మంచాలూ వద్దు ఇప్పుడు నాలుగే ఆకులు చీకటి పడేలోపున ఆ ఆఖరుది కూడ పడిపోతే చూస్తాను. ఆ తర్వాత నేను కూడ .."

"రజనీ, ప్లీజ్!" శారద మంచం మీదకు వంగి వున్నది మిత్రురాలి భుజాలు రెండూ పట్టుకుని ప్రాధేయ పూర్వకంగా చూసింది. "నా మీద ఒట్టే సున్నాను. నేను నేనా బొమ్మ పూర్తి చేసేంతవరకు కిటికీవేపు చూడటం మానేసి కళ్ళు మూసుకుని పడుకోవూ? మంచిదానివి గా? రేపు సాయంత్రానికల్లా బొమ్మను వాళ్ళకు అందజేయాలన్న సంగతి నీకూ తెలుసాయె...లేదంటావా కిటికీ మూసేస్తాను.

"అవతలి గదిలో గీసుకోరాదా!" నిర్దయగా అడిగింది రజని.

చచ్చినా నే నిక్కణ్ణుంచి మాత్రం కదలను. మొండిగ అన్నది శారద: "అంతే కాదు. నువ్వా ఆకులవేపు చూడటం కూడ నేనొప్పుకోను"

"సరే అయితే." నిశ్వసించింది రజని. చిన్నగ కళ్ళు మూసుకుని అన్నది "నీ పని పూర్తికాగానే చెప్పు ఎందుకంటే నేనా ఆఖరి ఆకు పడిపోవటం మట్టుకు తప్పకుండ చూడాలి. ఇట్లా ఎదురు చూడటము, ఆలోచించటమూ అంతా అలసిపోయాను. నేను కూడా అన్నిటి మీద పట్టులు సడలించుకుని ఆ ఆకుల్లాగే అలా.అలా క్రిందికి ప్రయాణం చేయాలనిపిస్తోంది."




"ముందయితే నువ్వు నిద్రపోవటానికి ప్రయత్నించు. నేనీలోపు క్రిందికి వెళ్ళి రామస్వామి తాతని మేడలోకి పిల్చుకు వస్తాను. ఇప్పుడే వచ్చేస్తాను. నే వచ్చేవరకు మాత్రం కదలకూ...."

కిటికీ రెక్కలు మూసేసి క్రిందికి పరిగెత్తింది శారద.

రామస్వామి తాతకు అరవై ఏళ్ళుంటాయి. ఎత్తయిన ఒళ్ళు. తెల్లటి వెంట్రుకలతో వరులాకాటపు గడ్డం కళ్ళ చివర్ల. చెంపల పక్క చర్మం గీతలు పడి ఉంది. కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది ఆయన మొహంలో. క్రింద వాటాలో ఒక గదిలో ఉంటున్నాడు. ఆయన కూడా ఒక ఆర్టిస్టు. కాని పేరులయిన ఆర్టిస్టు వల భైయేళ్ళ క్రితమనగా కుంచె పట్టాడు. కాని అర్ధ కన్య వస్త్రపు అంచునైనా తాకలేక పోయాడు. ఎప్పుడూ ఏదో కళాఖండాన్ని గీయబోతున్న వాడిలా కనిపిస్తాడు, మాట్లాడ తాడు. కాని ఇంత వరకు దాని కాయన ప్రారంభమే చెయ్యలేదు. ఎప్పుడన్నా ఏదన్నా చిత్రించటానికి ప్రయత్నిస్తాడు కాని ఏసగమో అయాక అసంతృప్తితో గబాల్న కాన్వాసును చింపేస్తాడు. ఎట్లా సంపాదిస్తాడో. ఏమి సంపాదిస్తాడో. ఎప్పుడు తింటాడో ఎవరికీ తెలియదు. పగలల్లా బయటికి పోయి సాయంత్రానికి ఇంటికి చేరుకుంటాడు. రాత్రి ప్రొద్దుపోయే వరకు తెగ తాగి కిల్లాయి పాటలు పాడుతాడు. మెత్తగా ఉండే మనుషులంటే ఆయనకు అస్సలు సహనంలేదు. అట్లా ఉండకద్దని వాళ్ళని కోప్పడతాడు. ఆ వీధిలో వాళ్ళు ఆయన్ని ఆ అర ఆర్టిస్టుని కిద్దరికీ గార్డియన్ క్రింద భావిస్తుంటారు.

ఆ రోజాయన ఇంటిపద్దే ఉన్నాడు.

అసంగతి శారదకు తెలుసు. ఆమె వెళ్ళే సరికి చాపమీద మత్తుగ పడుకుని ఉన్నాడాయన. గదిలో ఒక మూల ఈజెల్ మీద కాన్వాసు అమర్చి ఉంది. తనమీద యజమాని గీయబోయే కళాఖండం కోసం ఇరవై ఏళ్ళ నుంచి ఎదురు చూస్తోందా కాన్వాసు గుడ్డ.

రజని చపలత్వాన్ని గురించి శారద ఆయనకు అంతా చెప్పింది. 'క్యయ్' మన్నాడాయన.

"నాన్‌సెన్స్! రాలి పోబోయే ఒక ఆకుతో తన చావును ముడి పెట్టే వాళ్ళు కూడ ఉన్నారా ఈ లోకంలో? నేవింత వరకు వినలేదు. ముందు నువ్వవతలకిపో. పీకవలు నేను మోడల్‌గా కూర్చోనే కూర్చోను అట్లాంటి చెత్త అభిప్రాయాన్ని నువ్వసలు ఆమె మనస్సులోకి ఎలా రానిచ్చావో నాకర్థం కావటం లేదు. ఛా. ఛా. పిచ్చి రజనీ!"

"అదసలే బలహీనంగా వుంది" శారద అన్నది. "జ్వర తీవ్రత ఆమెలో ఈ విచిత్ర భావాలన్నింటినీ ఆవేశ పెట్టింది." సరేలే తాతా నువ్వు నాకు పోజుకు కూర్చో పోతే పోయావు గాని ఒక సంగతి చెప్ప మంటావా?— నువ్వొట్టి దొంగ మూండావాడివి—"

ఇంతెత్తున లేచాడాయన.

"మొత్తానికి ఆడదానివని పించావు! పోజుకు కూర్చోనని ఎవరన్నారిక్కడ? పద. వెళ్దాం. అర గంటనుంచి నేను నీ కోసం కాసుక కూర్చుంటే నువ్వేమో ఇప్పుడిట్లా అంటావా? ఛా ఛా. జబ్బులో ఉన్న రజనీ అమ్మడు లాంటి వాళ్ళకు ఇది సరైన స్థలమే కాదు. ముందు నా కళాఖండం పూర్తి కానీ మిమ్మల్నిద్దరినీ మంచి ఇంట్లోకి తీసుకువెళతాను.

వాళ్ళిద్దరూ పైకి వెళ్ళేసరికి రజని నిద్రోతోంది. శారద చప్పుడు కాకుండా కిటికీ తలుపులు తెరచింది. ఇద్దరూ బెదురుగా కిటికీలోంచి బయటికి చూశారు. ద్రాక్షతీగవేపు. వెంటనే మవునంగా ఒకళ్ళ మొహం ఒకరు చూసుకున్నారు చల్లగ చిన్నగ వర్షం కురుస్తోంది.

కావి రంగు దుస్తుల్లో రామస్వామి తాత స్టూలు మీద కూర్చున్నాడు మోడల్ కోసరం.

మర్నాడుదయం నిద్రలేస్తూనే శారద రజనీ వేపు చూసింది. కళ్ళు తెరుచుకుని ఉంది. మబ్బుగా ఆమె కిటికీ వేపే చూస్తోంది.

"కిటికీ తెరువు. నేను చూడాలి ఆజ్ఞాపించింది." రజనీ బలహీన స్వరంతో.

భయం భయంగా వెళ్ళి రెక్కలు తెరిచింది శారద.

కాని...రాత్రి పొడుగునా కురిసిన అంత పెద్ద వర్షానికి అంతటి విసురు గాలులకీ తట్టుకుని ఇంకా ఒక్క ఆకు వ్రేలాడుతోంది గోడమీద. అది ఆ ద్రాక్ష తీగ మొత్తానికే ఆఖరుది. కాడ చివర ఇంకా ముదురు ఆకు పచ్చ రంగులను. అంచుల వంటి చుటూ ఆకులు క్షీణించిన ఎసుపు రంగులోను ఉంది. అది భూమికి ఇరవై అడుగుల ఎత్తున ధైర్యంగా గోడని పట్టుకు వ్రేలాడుతోంది.

"ఆఖరుది అదే." రజనీ అన్నది. రాత్రే గాలి పోతుందనుకున్నాను. అంత పెద్ద గాలి! అవును. వింటూనే ఉన్నాను. అను కున్నాను కూడా. కాని... అప్పుడే

ఏమయిందిలే. ఇవ్వాళైటూ అది రాలిపోవటం తప్పదు. దాన్తోనే నేనుకూడా...."

విల విలలాడింది శారద.

"రజనీ. రజనీ. నీసంగతి ఆలోచించక పోతే పోతూవుగాని. నా సంగతన్నా ఆలోచించు. నేనేం కాను?"

కాని రజని మాట్లాడలేదు. ప్రపంచంలో కెల్లా వంటరిని అన దగ్గది - బహుశా మిస్టరీతో కూడుకున్న ఆ సుదీర్ఘ ప్రయాణానికి తయారుకాబోతున్న 'ఆత్మ' కావొచ్చు స్నేహము. మిగతా ఈ భూమి మీద తనకున్న సంబంధాలన్నిటి నీళ్ళు వదులుతున్న కొద్దీ రజనీలోని చపల భావాలు బలపడ సాగాయి.

పగలు గడిచిపోయింది. సాయంత్రపు ఆ సంధ్య వెలుగులో కూడ ఆ ఆకు అలా గోడను పట్టుకు వ్రేలాడు తుండటాన్ని వాళ్ళు చూడగలిగారు. రాత్రి కాగానే మళ్ళా బలాన్ని పుంజుకుంది. వర్షం విసురుగా కిటికీని బాదసాగింది.

తెల్లారింది. కిటికీ రెక్కలు తెరవమని రజని నిర్దయగా శారదను శాసించింది.

ఆ ఆకు ఇంకా అక్కడ అట్లాగే వుంది.

చాలాసేపు దానివేపే చూస్తూ పడుకుంది రజనీ. హటాత్తుగా ఏదో గుర్తొచ్చిన దానిలా. కుంపటితో కుస్తీ పడుతున్న శారదను చప్పున కేకేసింది.

"నేను నిజంగా చాలా చెడ్డదాన్ని శారూ!" మిత్రురాలు దగ్గరకు వచ్చాక అన్నది. "ఏదో అదృశ్య శక్తి నాకు బుద్ధి చెప్పటానికి గాను. ఆ ఆకును అలా పడిపోకుండా ఉంచిందనుకుంటా. లేకపోతే ఏమిటి. చనిపోవాలని కోరుకోవటం పాపంకదూ? సరే. నాకొక్కస్త రొట్టె ముక్క తెచ్చిపెట్టు. పాలుకూడా. డబ్బులుంటే ఏవైన పళ్లు తెప్పించు. ఇంకా.... లేదు. ముందా అద్దానిటు పట్రా. నా వీపు వెనక కొద్దిగా దిళ్ళు పేర్చు. నువ్వు వంట ఎలా చేస్తున్నావో చూడాలి."

ఒక గంట గడిచాక మళ్ళా అన్నది ఆమె.

"శారూ! ఎప్పటికైనా ఒక రోజున హిమాలయాన్ని పెయింటు చేయగలననుకుంటా."

మధ్యాహ్నం డాక్టరు వచ్చాడు. ఆయన వెళ్ళిపోయేప్పుడు వెనకే శారద కూడ మెట్లవరకు నడిచింది.

"బాగుంది." ఆయన అన్నారక్కడ "మంచిగ పరిచర్యలు చేస్తే గెలుస్తావు. ఇక వెళ్తానమ్మాయ్. కింద యింకో పేషెంటును చూడాలి."

ఆయన కదుల్తుండగా శారద అడిగింది.

"కింద పేషెంటు ఎవరు డాక్టరుగారూ?"

"రామస్వామి అని ఎవరో ఒకముసలాయన. మీలాగే ఏదో ఆర్టిస్టు అనుకుంటా. పాపం ఆకవికి న్యుమోనియా. అది కూడ కాస్త తీవ్రంగానే మీద పడింది. అసలే నీరసపు మనిషి నాకయితే నమ్మకం లేదు. ఏదో ప్రాణం సౌకర్యం కోసం అన్నట్లు హాస్పిటల్కు జేర్పిస్తున్నాను గాని."

మర్నాడు డాక్టరు శారదతో అన్నాడు.

"గుడ్! గెలిచావు. ఇంక అంతా నీ మీద ఆధారపడి వుంది. మంచి

తింది. చక్కటి నర్సింగు - అంతే."

ఆ మధ్యాహ్నానికి రజని మొహం కాస్త కళగా కనిపించింది. 'ఫిల్మ్ ఫేర్' పేజీలు తిరగవేస్తూ తీరికగా మంచంమీద పడుకుని ఉందామె. అదే సమయాన శారద ఏదో చెప్పటానికన్నట్లు వచ్చి ఆమె పక్కనే మంచం పట్టెమీద కూర్చుంది.

"నీకు చెప్పాల్సిన ముఖ్యమైన విషయ మొకటి ఉంది రజనీ." విదానంగాఅన్నది శారద.

చెప్పమన్నట్లు పుస్తకంలోంచి దృష్టి మరల్చి పైకి చూసింది రజని.

"పాపం రామస్వామి తాత ఇంతకు ముందే చనిపోయాడు. న్యుమోనియా వల్ల రెండు రోజులు మాత్రమే జబ్బుతో తీసుకున్నాడు. ఆ మొదటి రోజు తెల్ల వారుయామున తాత గదిలోనుండి మూలు గులు వినిపిస్తే ఇంటాయన ఏమిటా అని వెళ్ళి చూశాడట. ఏముందీ! ముస లాయన గది మధ్య నిస్సహాయంగా పడి వున్నాడు. తడిసి ముద్దయిన ఆయన బట్టలు, బూట్లు, ఇంకా అలాగే వంటిని అంటి పెట్టుకుని ఉన్నాయట. అంత ఘోరమైన రాత్రిలో ఈయన ఎక్కడికి వెళ్లాడా అని ఆశ్చర్యపోయాడట. తాత పక్కనే కొంచెం అస్తవ్యస్తంగా ఇంకా కొడిగా వెలుగుతున్న ఒక లాంతరు. విచ్చిన ఒకటి, చిందర వందరగా పడి వున్న కొద్ది బ్రష్‌లు. ఆకు పచ్చ, పసుపు పచ్చ, రంగులు కలిపి వున్న ఒక 'పాలెట్' అవీ కనిపించాయట అదిగో, కిటికీలోంచి అటు చూడు, గోడమీద ఆ ఆకు! ఎంత పెద్దగాలి వీచినా అది ఎందు కని కదలనైనా కదలలేదనుకుంటున్నావు? నీ కోసమే. రామస్వామి తాత ఆ ఆకు రాలిన నాటి రాత్రే దాన్నక్కడుపెయింటు చేశాడు బ్రతికున్న రోజుల్లో ఆయన చేయుతూండే కళాఖండం అదే!"

(ఓ హెన్రీ కథ ఆధారం.)

---

మతిమరుపుగురించి ఓ పత్రికవారు పోటీ ఏర్పరివారు.

మతిమరుపు కారణంచేత ఆ పత్రికవారు అనుకున్న సంచికలో "మతిమరపు' వ్యాసం ప్రచురించలేదు.

"మతిమరుపు" వ్యాసరచనలో పాల్గొన్న ఓ రచయిత గడువుతేదీ తర్వాత మరోపత్రిక చిరునామాకు పంపించాడు ఆ పత్రికవారు "మతిమరపు" వ్యాసపోటీ ఏర్పాటు చేసిన పత్రికాధిపతులకుపంపించారు. ఈ రచయిత వ్యాసాన్ని ప్రచురించారు. చివర గమనికలో "రచయిత తన పూర్తి పేరు మతిమరుపుచేత సరిగా వ్రాయలేదు. వారువ్రాసిన విధంగా పేరు ఇలాఉన్నది. పి. వీరవెంకట....వారిని తమ పూర్తి పేరు తెలియచేయవలసినదిగా కోరుతున్నాము."

డి. ఉదయభాస్కర్ (మద్రాసు)

# రాక్షసి, నీ పేరు రాజకీయమా? వర్ధిల్లు!

(గత సంచిక తరువాయి)

ఆరాత్రి చిరంజీవి యింటికి ఆలస్యంగా వచ్చేడు.

భోజనం చేస్తున్నప్పుడు వెంకటస్వామి అన్నారు——

"నాన్నగారికి మళ్లా గుండెనొప్పి వచ్చిందట బాబూ! గదిలో పడుక్కొని వున్నారు."

ఆ మాటవిని చిరంజీవి నవ్వుకున్నాడు.

'మళ్ళా నాన్నకెవడో దమ్ముకు ఎదురు నిలిచేడు. ఈ మధ్య ఈ పాడు గుండె నొప్పులు మరీ ఎక్కువై పోతున్నాయి. ఎందుకు ఎక్కువకావూ-చాలామందిపాపం పోర్టిఫోలియో కోసం పడిగాపులు కాస్తున్నారాయె! ఎక్కడవచ్చేది? ఎన్ని ఉపప్రభువులిచ్చేది? నాన్నని దేవుడే కాపాడాలి!

చిరంజీవి భోజనం ముగించి రామదాసు గారి గదిలోకి వెళ్ళాడు. ఆయన మంచం మీధ పడుక్కొని వున్నారు.

ఆయన మొహంలో దిగులు స్పష్టంగా కనపించడంలో చిరంజీవి చాలా ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏమిటి నాన్నా! నిజంగా గుండె నొప్పినా కొంపదీసి?"

రామదాసు చిరంజీవిని దగ్గరగా రమ్మని సైగచేసేరు. చిరంజీవి ఆయన దగ్గర కొచ్చి నిలబడ్డాడు.

"అవునోరేయ్! నా జీవితంలో 'నిజం' వచ్చిపోయి చాలా కాలమైపోయింది. నేనేంచేసినా నటనే! నిజంగా వచ్చినా నా కవాన్ని కాల్చరు మీరు. మళ్ళా దీనికి బయటపడతానేమోననే అనుమానం మీకు. ఇక నేను నటించలేనురా జీవీ! నేను అలిసి పోయేను. ఈ నటనతో బాగా నలిగి పోయేను!" అన్నారాయన బాగా ఆయాస పడుతూ!

చిరంజీవి మరింత ఆశ్చర్యపోయేడు. చాలా వినయంగా అన్నాడు.

"క్షమించునాన్నా!"

"నీదేం తప్పుకాదురా! తప్పునాది. ఏది నిజమో ఏది నటనో నీకెలా తెలిసే

•ఆదివిష్ణు•

డుస్తుంది! ఆ అవకాశం నీకు నేనెప్పుడిచ్చేను గనక తెలీటానికి!''

చిరంజీవి నిశ్శబ్దంగా తలొంచుకు వింటున్నాడు.

"ఒరేయ్‌నాన్నా! చిరంజీవీ! నీకు సుమతి తెలుసునట్రా!''

తండ్రి. యింత ఆకస్మాత్తుగా సుమతి పేరు తలవడంతో కొడుకు గాలి పీల్చుకో లేకపోయాడు. అబద్ధం చెప్పడానికి టైం చాలక—

''తెలుసు'' అన్నాడు.

"తెలుసు అంటె ఏ రకంగా తెలుసు! మీ కాలేజీలో చదువుకుంటూన్న స్టూడెంట్ గానా? నీ లీడర్‌షిప్‌ని వర్షిప్ చేస్తూన్న అభిమానిగానా? లేక నిన్ను నమ్ముకున్న ప్రియురాలిగానా? ఎలా తెలుస్రా నీకు? ఫర్లేదు. చెప్పు నేనేమీ అనుకోను. చెప్ప రా జీవీ! చెప్పు!''

చిరంజీవి పెళ్ళు నములుతూ అన్నాడు.

సుమతి నన్ను ప్రేమించింది నాన్నా!''

"అల్లా చెప్పు. ప్రేమించిందా నిన్ను. బావుంది. మరినువ్వు ఆ పిల్లని ప్రేమించేవా?'' అతను అడ్డంగా తలూపేడు.

"మంచిపని చేశావు ప్రతి దిక్కుమాలిన ఆడపిల్లనీ ప్రేమించేందుకేనా నువ్వు పుట్టింది? వెల్‌డన్ మైడియర్‌సన్! వెల్‌డన్! పోనీ ఆ పిల్లనొరేయ్!—నీ ఎరికలో ఎవరైనా ప్రేమించినట్టున్నారా?''

"వున్నారు నాన్నా! మన సీతాపతి గారు లేడూ! వాడైతే రాస్కెల్. నా ఎలక్షన్ని అడ్డంపెట్టుకుని ఆ అమ్మాయితో చీటికి మాటికీ మాటాడి వచ్చేవాడు. వాడు పచ్చిదుర్మార్గుడు నాన్నా!''

రామదాసు నవ్వుకున్నారు. నవ్వుకుని అన్నారు.

"ఒరేయ్! మనం దుర్మార్గం గురించి మాటాడుకుందాం. అయితే, సీతాపతి సుమతిని ప్రేమించేడంటావ్?''

"అవును''

"నువ్వు సుమతితో కలిసి తిరిగేవాడివి కాదా?

మళ్లా అతను అడ్డంగా తలూపేడు.

"పాపం రా జీవీ! తండ్రిని, కన్నతండ్రిని చీట్ చేస్తే మహాపాపం! దేహొద్దున ప్రజల్ని చీట్ చేద్దాం. అది మనడ్యూటీ! కానీ, కన్నవాడ్ని నువ్వు నన్ను చీట్ చేస్తే పాపం కదా! నాకు నిజం చెప్పు! జరగబోయేదేదో జరిగే తీరుతుంది. నీ ప్రయోజకత్వమేమిటో నాకూ తెలియాలిగదా. అందుచేత నిజం చెప్పు!''

చిరంజీవికి తండ్రిలోని మార్పుచాలా అసహజంగా కనుపించింది. ఇష్టంలేక పోయినా నిజం చెప్పక తప్పిందికాదు.''

"తిరిగేను'' అన్నాడు కొడుకు.

ఆమాటవిని ఆనందించేరు తండ్రి.

"మంచిది. అలా నిజం చెబుతూంటె నాకు ముచ్చటగా వుంటుంది. తిరిగేవు బాగుంది. ఆ పిల్ల యిప్పుడు గర్భిణిట తెలుసా?''

"ఎవరు చెప్పేరు నాన్నా?''

"ఎవరు చెబితేనేమిటిగాని. నేనడిగింది నిజమా?''

"నిజమే!''

సుమతికి పుట్టబోయే శిశువుకి తండ్రెవరు?''

"నేను.''

"మరి! ఇప్పుడు పిల్లని నువ్వు పెళ్ళి చేసుకోడానికి సిద్ధమా?''




"నాకిష్టంలేదు నాన్నా!"

"ఎందుచేత?"

"వాళ్ళదగ్గిర డబ్బులేదు. సుమతి నా భార్యగా రావడం. సుమతి అదృష్టమే. కాని, నేను సుమతికి భర్తనయితే అది నా దౌర్భాగ్యమే! ఈ పెళ్ళితో నేను ఎదగలేను నాన్నా!"

రామదాసుగారు పకపకా నవ్వేసేరు. నవ్వి. అలిసి పోయిన గొంతుతో అన్నారు.

"నన్ను మించిన బిడ్డవు. తండ్రిని మించిన కొడుకు నిచ్చి పుణ్యం కట్టుకున్నావురా దేవుడా! నీకు జై!"

"నాన్నా!"

"అవును నాయనా! నువ్వు అభివృద్ధిలోకి వచ్చే సూచనలు గమనించి నేను మురిసి పోతున్నాను. మన సుఖం కోసం మనం అష తొంబై వెధవ పనులు చేస్తే

చెప వుండొచ్చు. అంత మాత్రాన మనం చేసిన వెధవ పని కి తలొంచి శిక్షిమటని అడిగితే మన సరదాలు ఏంగాను? మన గొప్పతనం ఏంగాను?''

"ఇవాళ నువ్వెందుకో తమాషాగా మాటాడుతున్నావ్ నాన్నా!''

''ఇది ఏమంత ప్రభావమూ కాదు చిన్నా! నా చిన్నతనాన్ని నీతో పోల్చుకు చూచుకుని 'ఎంతెంత పనులని' అని అనందిస్తున్నాను. ఒరేయ్ జీపీ! నీకు ప్రసాదం తెలుసట్రా?"

''ప్రసాదమా? ప్రసాద మొచ్చేడా నాన్నా? వాడే సుమతి విషయం చెప్పేడు? సుమతికి ప్రసాదమంటే చెడ్డ యిష్టం నాన్నా? అందుకే వచే డు కాబోలు! అన్ని విషయాలు వాడే చెప్పేడు నీకు?....''

రామదాసు గుడ్లప్పగించి కొడుకుని. అతని బంగారుని చూస్తుంది బోదం వల్ల చిరంజీవి అక్కడితో ఆగి పోయేడు.

అప్పుడు రామదాసు అన్నాడు—

''తోక కదిపిస్తే చాలు — గాడిదో గుర్రమో తెలుసుకోవటం నాకూ అలవా టేరా! ప్రసాదం ఎలాటి వాడు?"

''మంచి వాడే అనుకో కొంచెం తిక్క రాస్కెల్!''

''తిక్క రాస్కెలా?''

''అవున్నాన్నా! అందరిదీ ఒకదారి, వాడిదోదారీను. వాడికి వాళ్ళమ్మా నాన్నా లేరు. వాళ్ళక్కవుంది. పిరి పల్లెలో టీచ రమ్మట! వాళ క్కే అతన్ని పెంచిందట. అందుచేత వాళ్ళక్కకోసం వీడేమైనా చేయగలడు. వాళ్ళక్క చదువుతున్న వీధి పాఠాన్ని తూ. చ తప్పకుండ పాటిస్తాడు వెధవ! ప్రేమించడం బూతని చెప్ప వుం టుంది—ఆ మాట ప్రకారం, సుమతిని ప్రేమించటం మాను కున్నాడు. విడ్డూరంగా లేదు నాన్నా?''

''వాళ్ళక్క పిరిపల్లెలో టీచరమ్మా? వాళ్ళక్క మాట ప్రసాదానికి వేద వాక్కా? బాగుంది. వాళ్ళక్క పేరేమిట్రా జీపీ?''

''సీత? సీతక్కంటాడు రవిగాడు గూడాను. రవిగాడు ప్రసాదానికి రూమ్మేటులే! ప్రసాదంతో స్నేహం చేస్తూ వాడి రంగులన్నీ వీడు వంట బట్టించుకున్నాడు ఫూల్!''

రామదాసు సీత పేరు విని వినటం తోటే హతాశులయ్యేరు!

''నువ్వెళ్ళి పడుకోరా జీపీ! వెళ్ళి పో యిక్కడ్నుంచి'' అన్నారు.

చిరంజీవి చేతులూపుకుంటూ వెళ్ళి పోయాడు.

రామదాసుకి సీత పేరు విని వినడం తోటే, గుండెల్లో పోటెక్కువ యింది. తట్టుకోలేక కన్నీరు పెట్టుకున్నారు. ఆ బాధకి వొళ్ళంతా మెలికలు తిరిగిపోతూం డగా 'నన్ను క్షమించు సీతా! క్షమించు' మని మూలిగేడు.

# 10

పాత పెంకుటింట్లో ఒక గదిలో అద్దె కుండి చదివేవాడు రామదాసు.

ఇల్లు గలాయన బడిపంతులు.

అతి మంచివాడాయన అందర్నీ అతిగా నమ్మేసే గంగిగోవు. ఆయన పేరు గంగాధరం.

గంగాధర గారికి కూతురు సీతంటె పంచప్రాణాలూను.

సీతని పూవులా పెంచి, చదివించి,

# జరిగిన కథ - కనూవిగ్రాష్య

తిమ్మాపురం పురపాలక సంఘ ప్రెసిడెంటు రామదాసుకు ఆస్తి అంతస్తు అన్నీ ఉన్నాయి. ఆయన వారసుడు చిరంజీవి కాలేజీ ఎలక్షన్‌లో నిలబడి గెలిచాడు.

ఆ కాలేజీలోనే చదువుతున్న వరప్రసాదంతో పరిచయం పెంచుతున్న సుమతి అకస్మాత్తుగా ప్లేటు ఫిరాయించి చిరంజీవి వైపు మొగ్గుతుంది.

సుమతి, చిరంజీవుల ప్రేమ గురించి సీతాపతి సత్యంతో చెప్పగా వాళ్ళిద్దరికీ మాటామాటా పెరిగింది. ఒక రోజున సీతాపతి ప్రసాదును కారులో బీచ్‌కు తీసుకు వెళ్ళి సుమతి, చిరంజీవి ఒకరిలో ఒకరు ఏకమయ్యే దృశ్యాన్ని చూపించాడు.

మీరు త్వరలో తండ్రి కాబోతున్నారని సుమతి. చిరంజీవితో చెప్పగా గర్భస్రావం చేయించుకోమని సలహా ఇచ్చాడు. ఆ తరువాత చిరంజీవి సుమతిని కలవడమే మానేసాడు.

సుమతి తన గాధనంతా ప్రసాదంతో చెప్పగా ప్రసాదం రామదాసు గారితో మాట్లాడదామని వెళ్ళి. ఆయనచేత అవమానింప బడ్డాడు.

—ఇక చదవండి.

---

యోగ్యుడైన వరుడ్ని వెతికి, ఆకాశమంత పందిట్లో, భూదేవంత మంటపంలో సీతనిచ్చి పెళ్ళిచేసి, వాళ్ళకి పుట్టే బంగారు బొమ్మలెత్తుకుని ముద్దులాడి వగైరా వగైరా ఆశలపట్ల గంగాధరానికి అమితమైన ఆసక్తి.

నగంరోజులు ఈ ఆశల్తోనే గడిపే వాడా పెద్ద మనిషి.

సీత ఇంటర్మీడియట్ చదువుకుంటూ ఉన్నప్పుడు ఈ రామదాసు సీత వాళ్ళింట్లోనే వుంటూ బి. ఎ. ఆఖరి సంవత్సరం చదువుకుంటున్నాడు.

పుట్టీ పుట్టటంతోనే రాజకీయాలూ, ఎత్తుగడలూ వెంటబెట్టుకు పుట్టాడు రామదాసు.

గంగాధరాన్ని బాబాయంటూ, వాళ్ళావిడ్ని పిన్నీ అంటూ వరసల్తో పిలుస్తూ సీతని మాత్రం 'సీతగారూ' అని మాత్రం పిలుస్తుండేవాడు రామదాసు.

బాబాయ్, పిన్నిలను గెలిచాడు. వాళ్ళిద్దరి దగ్గరున్నంచీ గౌరవాన్ని. ఆదరాన్ని సంపాయించుకున్నాడు.

"రాముడు మంచివాడు. ఇంటిదగ్గర తలవంచి మళ్ళా కాలేజీలోనే తలెత్తే కుర్రాడు రాముడు. అతని చదువేమిటో అతని తిదేమిటో తప్పించి ఇతర వ్యవహారాలకి పోయే కుర్రాడు కానేకాడు." అని బాబాయి. పిన్నిలు అనుకోడం రామదాసుకి బాగా తెలుసు.

మంచీ చెడులపట్ల రామదాసు ఒక

తిరుకేసి తయారు చేసుకున్నారు ఆ రోజుల్లోనే ...

దుష్టపాత్రలకి సుఖాల్లేవని అతనికి తెలుసు. దుష్టుడని తెలుస్తే మంచి పిల్లి వ్వరు తోటి మనుషులు. (వాళ్ళు దుష్ట జాతివారైనా!) దూరం దూరమని ఈగని తోలినట్టు తోలిపారేస్తారు.

మంచి చేయకపోయినా, మంచి (స్వభావం) ముసుగులో దాక్కోడం వల్ల చాలా సుఖాలుంటాయని అతను భావించాడు.

ఎన్నిరకాలుగా ఆలోచించినా, దుష్టుకి కంటె మంచి వేషధారే ప్రమాదమైన వాడు. దుష్టుడు ప్రజల్ని భయపెట్టిసాధించలేని కార్యాలెన్నింటినో, మంచి వేషం కట్టిన మనిషి అతి సులువుగా సాధించ గలడు. చాలా పవర్‌ఫుల్ విషాన్ని పాలల్లో కలిపేసి 'తాగమ్మా పాలు' అని మంచివాడంటే అవతలి వాడు కళ్లు మూసుకుని తాగేస్తాడు. తాగిం తర్వాత మరింత కళ్ళు తెరిచే పని వుండదు. ఈ పని దుష్టుడి చేతకాదు. దుష్టుడు ప్యూర్ పాలనే యిచ్చినా, శంకించి తాగని మూర్ఖులు చాలామంది బతుకుతున్నారాయే

ఇవన్నీ గమనించిన మీదట రామదాసు మంచి వేషం కట్టాడు చాలా కాలం సీతను చూచీ చూడనట్టు గడిపాడు. బి ఏ. పరీక్షలు పూర్తి చేసేంతర్వాత ఇంటికెళ్ళేముందు అతను చేయవలసిన పనిని చాలా హాయిగా చేసేసి, చేతులు రెండూ దులుపుకున్నాడు.

బాబాయి పిన్ని పొరుగూరు వెళ్ళిన అవకాశాన్ని చాలా చక్కగా విని యోగించుకున్నాడు రామదాసు.

రామదాసు గదికి తలుపులు రెండు న్నాయి. ఒకటతను వీధిలోకి వెళ్ళేందుకూ మరొకటి ఆ యింట్లో పిన్నీ వాళ్ళ వాటాలోకి వెళ్ళేందుకూను.

రెండో తలుపు (పిన్నీ వాళ్ళ వాటాది) అస్తమానం మూసే వుంటుంది. మొదట్లో ఆ తలుపుకి గొళ్ళెం పెట్టి జాగ్రత్త పడ్డాడు బాబాయి. తర్వాత్త ర్వాత రామదాసు విషం కలిపిన పాలు సిద్ధంచేసినాటినుంచీ, ఆ తలుపుకి గొళ్లెం తొలిగించి 'నీ లాటి మంచి కుర్రవాళ్ళకి తలుపులూ, గొళ్ళాలూ భావ్యం కావునాయనా!'' అనేవాడు బాబాయి.

గనక, ఆ తలుపుని యిష్టమైనపుడు తెరిచే ఏర్పాటుకి ఏ అటంకిమూ లేక పోయింది.

ఆ రాత్రి—

వేసవైనా అదృష్టవశాత్తు వర్షం గొడవ వచ్చింది. ఆ రాత్రి చాలా చీకటి గానూ వుంది. సరిగ్గా ఆ రాత్రే కరంటూ పోయింది.

రాత్రి చీకటిగా వుంది.

చీకటి రామదాసుని కదిపి చూచింది.

రామదాసు పడుకున్న మంచంమ్మీదే పిడుగు పడినట్టు గావుకేక పెట్టాడు. ఆ ఒక్కకేకకే పక్కవాటాలో వున్న సీత ఉలిక్కిపడి నిద్రలేచి స్విచ్ వేసింది వెలుతురుకోసం. దీపం వెలగలేదు. అందుచేత తనక్కడే నిలచి—

''ఏవయ్యింది?'' అని అడిగింది.

రామదాసు గొంతులో గుండెనిలిచింది.

''ఒకసారి తలుపు తెరవండి సీతగారూ!''

ఈ గదిలో నాకేవిటో భయంగా వుంది.'' అన్నాడు.

''భయమా? ఇంకా నయం! మగధీరులు మీకేవిటి భయం?''

అని నవ్వుకుంటూ పిచ్చి పిల్ల తలుపు తెరిచింది.

అకల్తో వున్న పులి ఆ గదిలోకి, సీత గదిలోకి చేరింది. చాలా అమాయకంగా గర్జించింది?

''నిజమండీ బాబూ! నేనొక్కడ్నీ ఆ గదిలో పడుకునేందుకు భయపడి వచ్చేను. అవునూ, మీకు భయంలేదా!...ఎక్కడున్నారండీ? పెధవది. సమయానికి కరెంటు గూడ పోయింది. మాటాడండి సీత గారూ. నాకు దడగా వుందండి!''

సీత అప్పుడు గూడ హాయిగా నవ్వేసింది. నవ్వు ఆగి పోయిందర్వాత చేతిలో కొవ్వొత్తితో ప్రత్యక్షమయ్యింది.

''ఇంత భయమైతే ఎల్లానండి దాసు గారూ?'' అన్నదామె.

''ఇంక భయంలేదు లేండి మీగదిలోకి వచ్చేసేనుగా ఇంకేం భయంనాక?''

''అంటే? ఇక్కడే. ఈ గదిలోనే పడుకుంటారా?''

''మరేం చెయ్యమంటారు? ఇంటింట్లో మనిద్దరమే వున్నామాయె! అలాంటప్పుడు మీరో గదిలో, నేనో గదిలో అయితే యింక చెప్పక్కర్లే—ఉదయంలేవాక నా శవాన్ని చూస్తారు. కాదనకండి.'' పులి యింకా అమాయకంగానే వేషకోవటంతో పిల్ల మళ్ళా నవ్వేసి—

''సర్లెండి. పడుకోండి. నిద్ర పట్టేందుకు కథ గూడ చెబుతాను. దెయ్యం కథ చెప్పన్లేండి. రాజుగారి కథ చెబుతాను. అదుగో ఆమదత మంచం వాల్చుకుని పడుకోండి...ఉదయం నాన్న వాళ్ళు వస్తే మీభయం గురించి వాళ్ళకి చెప్ప మంటారా మరి?''

బాబోయ్! అంత పని మాత్రం చెయ్యకండి. ఇక్కడికే సిగ్గుతో ఛస్తున్నాను. సిగ్గు వొదిలించుకుందామంటే భయ తో ఛస్తాను.'' అన్నదా పులి మరింత వొణికి పోతూ—

అప్పటికా క్షణంలో సీత. రామదాసు పట్ల జాలిని ప్రదర్శి చింది.

కానీ, ఆ గంట గడిచీ గడవగానే ఆజాలి తొలగి భయపడక తప్పింది కాదు—సీతకు.

పులి పులిగాక కనుపించి కేవలం పాదుపునవి హామీనిస్తూ ప్రసంగం చేసింది. ఏం చేయాలో తోచక ఆ ప్రసంగ మంతా వింటూనే వుంది పిల్ల.

''......సీతగారూ! నేను రెండు రోజుల్లో వెళ్ళిపోతానండి నాకు భయం గానే కాదిప్పుడు, మీమీద చెప్పలేనంత 'ఇష్టం' వుంది....చాలా ప్రశాంతంగా వినండి సీతా! నాకు స్నేహితుల్లేరు. తల్లీ తండ్రీ వున్నారు. అయితే వాళ్ళ నుంచి స్నేహంపొందలేను మంచి స్నేహితుల్నెవరైనా ఎంచుకుందామా అంటే, ఎవర్ని నమ్మాలో ఎవర్ని నమ్మకూడదో నాకు తెలీటంలేదు. ఇదిగో, మిమ్మల్ని నమ్మేను చివరికి....మిమ్మల్ని నమ్మేను అందుచేత సీతగారూ. మీరునాకు మంచి స్నేహితులు. స్నేహితులే గాదు. మీరేమీ అనుకోనంటె. అవును నేనెప్పటికైనా చెప్పక తప్పదు. నేను మిమ్మల్ని ప్రేమించేను. ప్రేమిస్తున్నాను. నాగురించిగూడ

చెబుతాను వినండి. నేనొక్కడ్నే సంతా నం కొంచెమో గొప్పో అస్తివుంది. పర్లేదు నాకు ఉద్యోగం లేకపోయినా. నాభార్య పిల్లల్ని పోషించుకోగలను.

నేను రెండురోజుల్లో వెళ్ళిపో తున్నాను. చెప్పేనుగదూ. వళ్ళావచ్చి మిమ్మల్ని తప్పకుండా పెళ్ళిచేసుకుంటాను. నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోలేకపోతే ఇంకీ జన్మలో ఎవర్నీ చేసుకోలేను చేసుకోను. మీరు లేవకండి. నేనే మీమంచం దగ్గరకి వస్తున్నాను. ఏం మాటాడకండి వ్యతి రేకంగా మీరివ్వదేదైనా చెబితే. అప్పు డున్న నా బియావికది తోడై నా గుండె జగి చచ్చిపోతాను. నన్ను హత్య చేయ కండి ప్లీజ్. మీరింకేమీ మాటాడొద్దు. నాకొంచెంచోటివ్వండి.థేంక్స్ లేవకండి మరి మనం చేసేదంటూ ఏ తప్పులేదు. నామంచి తనమీదనమ్మకంముందే వుందనే అనుకుంటున్నాను. అదుగో లేకండి సీతా! ఐ పేయూ నాట్ టు లీవ్‌మి ఎలోన్! ఐ ప్రేయూ సీతా! ఐ లవ్ యూ!.."

అతను సీతని పూర్తిగా ఆక్రమించు కున్నాడు. సీత విలవిల్లాడిందిగాని. ఎదురు చెప్పేందుకు దేవుడా సమయాన ఓపిక యిచ్చేడు కాదు. రామదాసు దుర్మార్గుడో అనుకుంటున్నట్టు సత్యహరిశ్చంద్రుడో తేల్చుకునేందుకు గూడా అవకాశమిచ్చేడు కాదు దేవుడు.

ఓట్టచివరికి రామదాసే గెలిచేడు సీతని! —పచ్చనెత్తుటితాగే పరమకిరాతకుడు చేయలేని పనినొకటి రామదాసు అతి సునాయాసంగా చేసిపారేసేడు.

ఒక గొప్పింటి సంబంధం తండ్రి తీసుకొచ్చాడు. నోరెత్తకుండా అంగీ కరించడమే గాకుండా లేటెస్ట్ డిజైన్లో కుట్టించిన ఆచ్చొత్తించిన వాటిని స్వయంగా అతనే పంచేడు.

గంగాధరంగారు పూరు వెళ్ళి వాళ్ళింటి ముందు రిక్షాదిగి 'నమస్కారం బాబాయి గారు! నమస్కారం పిన్నిగారూ! నమ స్కారం సీతగారూ! —ఇదిగో శుభలేఖ! అది ఎంతో ప్రాధేయ పడుతూ శుభలేక యిచ్చేడు రామదాసు.

అతని వల్ల సీత చెడిపోయిన పైనం తెలీని ఆ తల్లి తండ్రులు అతని వినయా నికి సంతోషించి సీతచేత కాఫీ యిప్పించి తప్పకుండా పెళ్ళికొస్తామని చేతిలో చేయి వేసి చెప్పేరు రామదాసుకి—ఆ వెర్రి బాగుల దంపతులు!

రామదాసు కాఫీని చాలా తాపీగా. కడు నిబ్బరంగా. నిశ్చింతగా తాగుతుం డగా...ఇంతలేసి కళ్ళతో చూస్తూ....ఏం చేయాలో తోచక....గుబులు గుబులుగా.. తలుపు చాటున నిలబడింది సీత!

కాఫీముగించిరామదాసు వెళ్ళిపోయేడు.

రామదాసు పెళ్ళి భాగ్యవంతులి పిల్లతో అతి వైభవంగా జరిగింది. పెళ్ళికి తప్ప కుండా వస్తామని హామీ యిచ్చిన గంగా ధరం దంపతులు రాక పోయినందుకు రామదాసు చింతించలేదు. పైపెచ్చు— సీత ద్వారా తన పాపు కథ వాళ్ళకి తెలిసి పోయి వుంటుందని ఊహించి 'అమయ్య! నేను తప్పుకున్నాదింక. అని గాలిపీల్చు కున్నాడు.

మళ్ళా ఇన్నేళ్ళకి నేడు చిరంజీవి పాడు పని చేసి తండ్రిని మురిపించే సరికి. తండ్రికేదో షాకు తగిలి నట్టయింది.

(ఏశేషం)



ఊరిలోని రోడ్లన్నీ నిర్మానుష్యం అయిన వేళ, కుక్కలూ, నేకులూ తప్ప వేరేవీ కనిపించని వేళ,

కలవాళ్ళందరూ అద్దాలమేడల్లో పంకాల క్రింద పడుకొని, ఏర్కండిషన్ ఈ పాడు కొంపలో లేదని విసుక్కుంటున్న సమయంలో —

మిట్టమధ్యాహ్నం. నల్లగా, మెలికలు తిరుగుతో, మెరుస్తో, ఎండకు చెమట కక్కుతున్న తారురోడ్డుమీద హుషారుగా, ఈలేసుకుంటూ, రిక్షా తొక్కుకుంటూ వెళ్తున్నాడు వీరడు.

"ఛీ! ఎదవది." అని ఎండనీ, ఆ ఎండని సృష్టించే సూర్యుణ్ణీ కలిపితిట్టేడు వీరడు. ఆ రోజు అంత ఎండ, తనను మాత్రం సోకనట్టు, తనకది వెన్నెల్లా చల్లగావరాలుచిలిపి చూపుల్లాఫీలయ్యేడు

ప్రొద్దున రిక్షా అద్దెకు తీసుకొంది మొదలు ఏడెనిమిది బేరాలు తగిలాయి. పర్వాలేదు. రిక్షా అద్దెడబ్బులొచ్చేశాయ్. ఇహ వచ్చేదంతా నాకేననుకొని చుట్టు ప్రక్కలా చూశాడు బేరం తగుల్తుందేమోనని.

దూరంగా నరిసి. చెట్టు క్రింద కూర్చొని అట్లుపోస్తోంది. అది చూసే సరికి వీరడికి ఆకలి ఎక్కువయినట్లయింది. కానీ, తను ఈరోజు దుబారా ఖర్చుచెయ్యకూడదు. సాయంత్రం ఇంటికెళ్ళేప్పటికి ఎలాగైనా అయిదు రూపాయల నోటు కళ్ళచూడాలి

ప్రొద్దున గుడిసెనించి బయటపడ్డపుడు—

"వరాలుకు ఏం తెస్తావ్‌రా అల్లుడా" అని అత్తమ్మ అడిగిన ప్రశ్న—

"ఏం తేలేవులే" అన్నట్లనిపించే ఆ వెక్కిరింపు—

"వరాలిప్పుడు ఒట్టిమనిషిగాదురా. వెర్రిబాగులోడా. నీళ్ళోసుకొంది. కోక లేకుంటేపోయే. ఓ రెవికముక్కయినా తీసుకరా"-అని చెవులు చిల్లులు పడేలా అత్తయ్య గొంతు వీపు వెనక.

అత్తమ్మన్నదిగూడా నిజమే. వరాలు కిది మొదటిసూలు. ఏరి కోరిచేసుకొన్న పెళ్ళాం.

"పెళ్ళాం అంటే బెల్లంలా సూసుకోవాలి రా వీరిగా! మనసయిందని మురిసిపోతే సాల్దు. మనువాడే ముందు ముదుపుకూడ బెట్టాలి"—అన్న అత్తమ్మ మాటలు ఒక్కసారి గుర్తుకొచ్చేయి.

వరాలుకు పాపం. పండంటి బిడ్డని చేతికెత్తుకోవాలని ఎంతో ఉబలాటం. ధూత్! ఎదవ బతుకులు. ఇలాంటి వేళలో గూడా ఓ రెయికగుడ్డ కొనిపెట్టడానికి డబ్బులుండవ్. 'ఏంటో!

కుక్కగొడుగుల్లాపుట్టి—
వీధికుక్కల్లానే పెరిగి—
ఇంతతిని,
అంత ఆకలితో—
కొందరితో కొట్లాడి—
చివరికి దిక్కులేని వాళ్ళలా మరలా మట్టిలో కలిసిపోవడం—

రెండు పెడల్సుమీద లేచి నిలబడి. తల నిక్కించి చూశాడు వీరడు. ఎక్కడైనా బేరం తగుల్తుందేమోనని. ఒకరిద్దరడిగేరు, రిక్షా కడతావా, అని. కానీ, పాతిక పైసలకొస్తావా. పదిపైసలకొస్తావా అని బేరం పెట్టారు. వీరడికొక్కసారి చిర్రెత్తుకొచ్చింది.

"పో. బాబూ పో. నాకెందుకొచ్చిన అవస్త. కాలినడకపోతే. ఆ పాతిక పైసలూ మీకే మిగుల్తాయ్!"

కొవ్వెక్కింది వెధవకు అనుకుంటూ వెళ్ళిపోతున్న పెర్లిన్ బాబును. చొక్కా యుచ్చుక కొట్టాలనిపించింది వీరడికి. కాని, ఎందుకీపోకిరి చేష్టలీ రోజు. అని వూరుకుని పోయాడు

నెత్తిమీది సూర్యుడు నడుంమీదకొచ్చేశాడు. అలా, అలా, కాళ్ళక్రింది కెళ్ళిపోయాడు. బేరం ఒకటి రాలేదు. వీరడికి కడుపులోని కండలు మెలికలు తిరుగుతున్నాయి. రెవికగుడ్డ కోసం ప్రొద్దుట్నుంచి నాస్తాగూడా చెయ్యలేదు..

నరిసి, దాని వల్లని చేతుల్లోంచి నూనెలో మిలమిలా మెరిసే మినపట్లు.

గుర్తుకొచ్చేయి.

అంతలో తను గుడిసెలోంచి బయటి కొచ్చినపుడు, అత్తయ్య నోటివెంచి రెవికగుడ్డ మాట రాగానే, వరాలు రేట కళ్ళల్లోని తళ. తళ గూడా గుర్తు కొచ్చింది.

డబ్బులు గిట్టనిరోజు అలా ఆస్పత్రి కెళ్తే. బేరాలు తగలటం చాలా మామూలే. మెయిన్గేట్ వైపు వచ్చే. పోయే వాళ్ళను ఆశతో చూశాడు.

''ఈ ఆస్పత్రికి ఇంతమంది వస్తారు గదా, ఈరోజు ఒక్క మహారాజయినా వచ్చి పోడేమిటి?'' ఒక్క శవాన్ని రిక్షాలో ఏసుకెళ్తే నాల్గురూపాయలు గిట్టుతాయి''

అని, మానవజాతి మీద ఉమ్మడిగా విసుక్కున్నాడు. ఆరోజు ఎవడూ చావ నందుకు.

ఈరోజు వరాలుకి రెవికగుడ్డ ఎలా కొనాలో ఏం అంతుబట్టడంలేదు.

ఇంతలో. అల్లంత దూరాన—

అతి త్వరగా అడుగులేసుకొంటూ తెల్లని రెక్కలు విప్పుకొన్న పావురంలా నర్సు. ఆమె వెనకాల చెమటపట్టిన మొహంతో. ఒక ముసలమనిషి-ఇకబతు కులో మిగిలిందిచీకటేమోననే అనుమానంతో.

''ముంచుకొచ్చిందిరా బాబూ ఎవరికో అదృష్టం బాగానేవుంది'' అనుకున్నాడు వీరడు.

''రేయ్! రిక్షా! రక్తం ఇస్తావా'' అని నర్సు తననడిగే ప్రటికి అదిరిపడ్డాడు. పోలేరమ్మ పూనకంవచ్చి. నాకు నరబలి వెంటనే ఇస్తావా, లేక నిన్ను అమాంతంగా మింగేయనా, అని అడిగినట్లు భయపడి పోయాడు.

''ఏంవిటలా గుడ్లప్పగించి చూస్తావ్? రక్తం అనగానే అలా బెదురుగొడ్డులా నీల్గక్కపోయావ్ ఈ అయ్యగారి భార్యకు వెంటనే రక్తం ఎక్కించాలి. లేకుంటే బతకదు. నీకు బాగా డబ్బులు వస్తాయి. తర్వగా తేల్చి చెప్పు. నువ్వు కాకుంటే మరొకడు''—అని, అతి నాజూగ్గా.

ఈ రోజు పనీమాకు తీసుకెళ్ళావా మావాం, అని వరాలడిగినంత తేలిగ్గా అడిగింది నర్సు.

అమ్మో! రగతవేఁ. రగతంఁఇచ్చేస్తే. తను రేపట్నుంచి రిక్షా తొక్కేదెంటి! ఇదేంటీ రక్తపు కూడు ఛీ. పోండి. నేను రాను - అని చీదరించుకోవాలను కున్నాడు.

కాని. ఇటువైపు నర్సు వెనక నిల్చొన్న ముదుసలి మనిషిని చూడగానే అభిప్రాయం మార్చుకొన్నాడు. కాళ్ళు చేతులు అవిటి అయిపోయినట్లు మోకాళ్ళ మీద తల ఆనించి, చలనం లేకుండా కూర్చొనున్న అతన్ని చూడగానే జాలే సింది వీరడికి.

డబ్బులు బాగా గిట్టుతాయట. అలా అయితే, రెయికేం ఖర్మ వరాలుకు కోక కూడా కొనిపెట్టొచ్చు - అనుకొని రిక్షా తొట్టిలోంచి దిగి బీడీ ముక్క విసిరేసి—

''పదండి రగతం నేనిస్తానని నర్సు వెనకాతలే నడిచి వెళ్ళాడు.

రక్తం తను ఇస్తానన్నాడేగానీ. అది ఎలాగ యివ్వాలో—

గొంతు కోసుకొని ఇయ్యాలో—
కడుపు చీల్చుకొని ఇయ్యాలో—
ఇవేంవీ వీరడికి తెలియవు. తెలిపిం

దల్లా, తనతోబాటు రిక్షా తొక్కే ఎల్లయ్య నుక్కుకు డబ్బులు తక్కువయినప్పుడల్లా ఇలా, ఈ ఆస్పత్రిలోనే రక్తం ఇచ్చి మక్కేసుకొని, చుక్కల దగ్గరికెళ్తాడని-

సీ! ఎదవా, నీదంతా లేకి బతుకు అని వాణ్ని ఎన్నోసార్లు తిట్టేడు గూడా.

ఆస్పత్రిలో—

ఇంద్రపురిలాగా, గొప్పోళ్ళ బతుకుల్లా దేదీప్యమానంగా వెలిగి పోతూన్న ట్యూబ్ లైట్లు—

దేవలోకంలోంచి అప్పుడే దిగివచ్చిన వాళ్ళలా, తెల్లని బట్టల్లోని డాక్టర్లు పరా లిచ్చే చల్లని తల్లుల్లా గౌన్లతో ఇంకి పోయిన నర్సులు—

వాళ్ళ నవ్వులు—

నవ్వుల పువ్వులు —

కేరింతలు—

సరసాలు-చిటకరింపులు వెక్కిరింతలు చూసి ముచ్చట పడ్డాడు వీరడు.

నేసీ, డాక్టరు బాబుల చుట్టూ చేరి, మా బతుకుల నేం చేస్తావ్ బాబూ, మా యింటి దీపం వెల్గించు, మా దుఃఖాన్ని దూరం చెయ్యి బాబూ-అంటూ ప్రార్థించే చూపులు-మంచాల మీద మూసిపోయిన గడాలు: కంపు కొడుతూన్న గావంచాలు-

ఎండిన రొమ్ములు—

వెలుగులేని కళ్ళు—

వీళ్ళందరిలో—

విల్కిన్సన్ షేవ్‌లు—

పిల్కు చీరల మడతలు—

ముదతల్లోంచి సెంటు వాసన ఘుమ. ఘుమలు—

చూసేసరికి, వీరడి కెందుకో చాలా బాధనిపించింది.

మంచం మీద ఇలా పడుకో-అంది నర్సు చెయ్యిలా పెట్టు అంటూ ఈడ్చింది. ఊసులు పోతోందిరా పిల్ల, అనుకొని ముదిసిపోయాడు వీరడు ఏవేవో గాజు గొట్టాలు, సీసాలు అమర్చేరు పక్కన. చేతికి సూది గుచ్చారు. అంతే, రక్తం వెళ్ళిపోత్తోంది సీసాలోకి, వీరడి శరీరం లోంచి—

రక్తం అంతా తీసేస్తోంది ఈ నర్సు. దీని బాబు సొత్తనుకుందోనేమోనని గొణిగేడు.

అలా ఎంతసేపయిందో తెలీదు. గొట్టాలు, సీసాలు అన్నీ తీసి పారేశారు అందరూ కలిసి.

వీరడి కేదో సుస్తీచేసి లేచినట్లయింది. ఈ పాలు తాగు-అంటూ గ్లాసు చేతి కిచ్చింది నర్సు.

అస్పత్రివించి బయటికి నర్సు వెనక నడిచి వచ్చిన ముదురు మనిషి జేబులో చెయ్యి పెట్టి, దూలుకొచ్చిన గేదెలా, పొట్టనిండుగా వున్న నల్లని పర్సుతీశాడు. నర్సు యింతలో అతన్ని వారించి లోనికి తీసికెళ్ళింది.

లోపల ఆపరేషన్ థియేటర్‌లో అచే తనంగా పడుకొని వున్న ముదురు మనిషి భార్య పక్కన నిల్చొని—

డాక్టరుబాబు ఏడు పదిరూపాయల నోట్లు తీసుకొన్నాడు. ఏడు పది రూపా యల నోట్లనించి ఒకటి నర్సు పర్సులో కెళ్ళిపోయింది. పది నర్సు కిచ్చినందుకు కమ్మని ముద్దొకటి వసూలు చేసుకొన్నాడు. రుమాల్తో మొహం తుడుచుకొన్నాడు. (నర్సు పెదిమల ఎంగిలి కూడా).

మేల్నర్సుకు మరో పది రూపాయలు పోగా, మిగిలిన ఏభై లోంచి ఓ పాతిక డాక్టర్‌బాబు అప్రాన్ జేబులో కెళ్ళి పోయింది.

మిగిలిన పాతిక కాళ్ళీడ్చుకుంటూ వీరడి చొక్కా జేబులో కొచ్చింది.

"అంతా అయిపోయింది. ఇంటికెళ్ళి కడుపు నిండా తిని పడుకో" అంది అర్జం టుగా నర్సు.

బయటి కొచ్చేడు వీరడు. రోడ్డు మీద చింతచెట్టు క్రింద బోసిగా, ఈసురో మంటోంది రిక్షా.

ఇంత డబ్బు. పాతిక రూపాయలు. అది గూడా ఒకచే రోజు. నేనెప్పుడూ చూళ్ళేదు. అ మాటకొస్తే నా బాబు గూడా చూసుండడనుకొంటూ రిక్షా రోడ్డు మీది కెక్కించాడు.

వీరడి బుర్రలో వేయి ఆలోచనలు. జేబులో పాతిక రూపాయలు. తన రక్తం విలువ పాతిక రూపాయలు - వరాలుకు మాంచి రెయిక గుడ్డ ఛీ! ఛీ! రెయికేం ఖర్మ. కోకే కొనగలడు తనిపుడు.

తన కిష్టమైన పచ్చని కోకలో వరాలు సీతాకోక చిలకలా వరాలు - ముద్దబంతి పువ్వులా మురిసిపోతుంది. అది నవ్వి నపుడు పడే సొట్టలు-కళ్ళతో ఆ పిలిపి—

బజారంతా కళ్ళలో ఒత్తులేసుకొని వెతికాడు వీరడు బట్టలషాపు కోసం. కానీ ఆ రోజు రావల్సినంత లాభాలు ఎప్పుడో వచ్చేశాయ్. అందరూ షాపులు మూసేసి వెళ్ళిపోయారు. తెరిచున్న దుకాణంలో

రెవిక గుడ్డలు కొన్నాడు వీరడు.

మొత్తం బజార్లో తెరిచి వున్న రెండో దుకాణం ఒక్కటే. అదే సాంబయ్య సారా దుకాణం.

ఎంత వద్దనుకున్నా. సారా బట్టీ ముందర రక్కువ ఆగిపోయింది వీరడి రిక్షా లోపలికి తొంగి చూశాడు. లోపల తెలిసిన ముఖాలు వున్నాయ్.

''వళ్ళంతా బాగా నలతగా వుంది కాస్త చుక్కేసు కుంటే కొంపలేం కూలవ్ కోక కావి పెట్టేనన్న సంబ రంలో వరాలు ఇదంతగా పట్టించుకోదు గూడా!'' అనుకుంటూ సారా బుడ్డితో దూరాడు వీరడు.

లోన, దొంగ సారా.

ట్యూబుల్లోంచి పీపాల్లోకి, పీపా ల్లోంచి గ్లాసుల్లోకి, గ్లాసుల్లోంచి గొంతుల లోకి ఖాళీ అయిపోతోంది. ఆకలిగొన్న కడుపుల్లోకి, అలా ఇంకి పోతూంది. సారాలోంచి ముమ్మరంగా బూతులు-

అమ్మలు, అమ్మమ్మలు,
అప్పా చెల్లెళ్ళు,
కన్న వాళ్ళు, కట్టుకున్నోళ్ళు,
తెంచిన వాళ్ళు,
తెంపించిన వాళ్ళు,
వదిలేసిన వాళ్ళు,
ఉంచుకొన్న వాళ్ళు-
ఎప్పుడో, పుట్టి, పెరిగి, చచ్చిన
ఏడు తరాల వాళ్ళు—
పుట్టి, పెరిగి, చావబోయే
ఇటు ఏడు తరాల వాళ్ళు—
చెమట కంపు చెర్మం వించి-
సారా కంపు నోట్లోంచి—
మాటలు, బడులు మాటలు—

వెక్కిరింపులు.

అయ్యో పాపం-లతో సాంబమ్మ సారా దుకాణం అంకమ్మ జాతర్లావుంది.

''అరగ్లాసుసారాతాగడాన్కి- ఆరు నెల్లా లోచించే వాడి వీరోజు, ఇలా గాలన్లు పట్టించేస్తున్నావేం కత'' అంటూ ఎత్తి పొడిచాడు, వీరణ్ని అప్పన్న.

ప్రొద్దిటినించి ఆకలితో సతమత మయి పోయిన వీరడి శరీరాన్ని, సారా, అప్పన్న ఎత్తిపొడుపు, కలిసి, బాగా గేరెక్కించేశాయ్.

''గేలన్లు గాకుంటే పీపాలకు, పీపాలే పట్టించేస్తాన్రా, ఎదవ నాయాలా నా ఇష్టం, ఎవడబ్బ సొత్తనుకున్నావ్! పెద్దా స్పత్రిలో, రగతం, రగతంరా, రగత మిచ్చి సంపా యించాను, నీదికాదు,నీ అబ్బదిగాదు, నీ బాబ్బాబు దసలేకాదు. ఇది నా డబ్బు కట్టుకొన్న దాన్ని ఇత ర్లకి పడుకో బెట్టి సంపాయించాననుకున్నావురా? నోరెత్తకు, మర్లా మాటాడే వంటే మూతి పళ్ళు రాలగొడతాను. ముచ్చు ఎదవా'' అంటూ రెచ్చిపోయాడు.

నేను విన్నంటే నాపెళ్ళాం వూపెత్తుతా వేంరా,లేవి ముండాకొడకా'' అంటూ వీరడి జుట్టు పుచ్చు కున్నాడు అదివరకే కైపెక్కి పోయిన అప్పన్న.

చేతులు కలిశాయ్, సారా నెత్తినా, మొహానా పారింది. ఇతర్ల కేవీ పట్టనట్లు తమాషా చూస్తున్నారు.

మరొక్క గ్లాసు పట్టించిన అప్పన్న ఖాళీగ్లాసును వీరడి మొహం మీదికి విశ రేశాడు గ్లాసొచ్చి వీరడి తలమీద బాకులా గుచ్చుకొంది. దెబ్బతో ఒక్కసారి తెలివి తెచ్చుకొన్న వీరడు, తన తలమీంచి

# మీరు కష్టపడి సంపాదించుకొన్న సొమ్ముకు సరియైన విలువగల సైకిల్ కొనదలచుకున్నారా? హెర్క్యులిస్



ప్రతీ పైసా కూడ మీరు కష్టపడి చెమటఊడ్చి సంపాదించుకున్నారు. మీరు కూడబెట్టిన అమూల్యమైన సొమ్మును సరియైన విలువగల సైకిల్ మీద పెట్టాలి కదా?

హెర్క్యులిస్‌ను కొనండి. దానికి మీరు ఆశించే అన్ని లక్షణాలున్నాయి — బలిష్టత, సాఫీగా పోవడము నిశ్చితము, వేగము, మన్నిక.

అది సహజమే.

హెర్క్యులిస్ — ఆగ్నేయ ఆశియాలో అన్ని సౌకర్యాలు గల పెద్ద ఫ్యాక్టరీలో నిర్మించబడింది కలకాలం మీ జీవితమంతా మీకు సేవజేస్తుంది. భారతదేశమందంతటా 8,000,000 మంది హెర్క్యులిస్‌నే విశ్వసించేవారిలాగే మీరు హెర్క్యులిస్‌ను విశ్వసించవచ్చు.

హెర్క్యులిస్ ఒక్క సైకిలే కాదు - మీ జీవిత కాలపు నేస్తము.

భారతదేశములో తయారుచేయువారు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53.

ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ అనుమతిని పొందినవారు.

* రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్క్ -
ది హెర్క్యులిస్ సైకిల్స్ & మోటార్ కో., లిమిటెడ్ యు. కె. వారిది.








TIC-H-5452

పారుతోన్న రక్తం చూసి—ఓలమ్మో. రగతం. రగతం. లంజి కొడుకు చంపే శాడురో, నాయనో—అంటూ కుప్పలా కూలిపోయాడు

• • •

అప్పుడు ఆ రాత్రి—

నీల్లాడనున్న వరాలు.

రెవిక గుడ్డ తెస్తావా అనడిగిన అత్తమ్మ. ప్రొద్దిటి వరాలు నవ్వు—

నవ్వినపుడు చక్కని సొట్టలు—

ఇవేవీ వీరడికి గుర్తులేవు.

• • •

అదే రాత్రి సమయంలో,

గుడిసెలో గుర్రుపెట్టి నిద్రపోతోన్న వరాలుకు కడుపులో పేగు ఏదో జారిపోయి నట్లయి—

అమ్మో పేణం పోయిందే. అంటూ దయ్యం పట్టినట్టు లేచి కూర్చుంది

పిడకలమ్మి సంపాదించిన చిల్లర డబ్బుల్తో అత్తమ్మ వరాలుని అస్పత్రికి తీసి కెళ్ళింది రిక్షాలో.

ఆస్పత్రి ఎమర్జన్ గేటు రాత్రి సమయాల్లో ఎప్పుడూ మూసుకొనే వుంటుంది. వేళకాని వేళల్లో ఎవరెవరి కోసం, ఎప్పుడు. ఏ పరిస్థితుల్లో తెరుచు కోవాలో దానికి బాగా నేర్పారు అధికారులు.

పోలీసు వాళ్ళకి. పొందిన కాడే నే వాళ్ళకి వెంటనే ప్రవేశం. కార్లకూ (కార్లోని కుక్కలకు గూడా) అపిసంగా ప్రాప్తి మవుతుంది మోక్షం. తక్కిన వాళ్ళ అదృష్టం. వాళ్ళగీత. ఆరోజుకి వాళ్ళ మొహం మీద బ్రహ్మదేవుడు రాసిన రాత మీద ఆధార పడి వుంటుంది.

అపస్మారకంగా పడున్న వరాలుకి. గేటు తెరుచుకోనని బాగా మోరాయించింది. అత్తమ్మ బొడ్లోని రూపాయ బిళ్ళ చూసే సరికి. పులినోర్లా విచ్చుకొంది. చప్పున.

వరాలుని లోపలికి తీసి కెళ్ళిన డాక్టరమ్మ. బయటికొచ్చి. చప్పగా. చల్లగా మూల కూర్చొనున్న అత్తయ్యతో ఏదో చెవిలో చెప్పింది. సన్నగా అత్తమ్మ నెత్తి, నోరూ బాదుకుంది.

"ఓరి దేవుడో- కడుపు పోతే పోయింది. నాతల్లి పేణాన్ని కాపాడరా వెంకన్నా రగతం నేనేడ్నుంచి తెచ్చేదిరా. నాయనో రగతం ఈదగిన ఈరడు యాడ్నో దాంగొని వచ్చాడు. బాబో. యాడ్నుంచి తేను యాబై రూపాయలు దేవుడో. కన్న కడుపువిలా కొయ్యకు గంగమ్మ తల్లీ'- అంటూ శోకాలు పెట్టింది. అందరూ కలిపి అత్తమ్మను బయటికిగెంటేసారు.

• • •

ప్రొద్దున్నే ఎండ వేడికి ప్రపంచం లోకి వచ్చిన వీరడు. రిక్షాని విసురుగా బజార్లోకెక్కించి. గుడిసె వైపు వెళ్ళి పోయాడు

• • •

ఆ మధ్యాహ్నం. ఏటొడ్డున. మండు టెండలో ఇసక తెల్లగా. స్వచ్ఛంగా మెరిసి పోతోంది. దూరంగా. ఎండకు చెట్టుమీద చేరిన గద్దలు గోల చేస్తున్నయ్. వరాలు గుండెల మీద కొరివి పెట్టిన వీరడి కళ్ళు వెచ్చని కన్నీళ్ళతో నిండి

పోయాయి. పిండిన కళ్ళు భగ్గుమని మండేయి. కళ్ళనించి మంటలు—కడుపు మంట—కన్నీళ్ళమంట

చప్పున, తేలుకుట్టి నట్లయి, జేబులో చెయ్యి పెట్టి ఏదో బయటకు తీశాడు. వీరడు. పామును చూచినట్లు బిత్తర పోయాడు.

రాత్రి స్పృహలేని స్థితిలో, కారే రక్తాన్ని తుడుచు కోడానికి వుపయోగించిన—రక్తం మరకల్తో—వరాలు కవి తను కొన్న పచ్చ రంగు రెవిక గుడ్డ.

("ఎక్కడా కానీ పుట్టకపోతే కొంత మంది ఆస్పత్రికి వెళ్ళి అయిదు రూపాయలు కోసం రక్తధానం చేసేస్తారు. అంత త్యాగం చేసి ఇంటికి ఆ అయిదూ పట్టుక పోదాం అంటే, అందులో రూపాయి అక్కడుండే చోటా ఉద్యోగి లాక్కుంటాడు కధ రాయొచ్చు"—అన్నారు. రాచకొండ విశ్వనాథశాస్త్రి గారు. అదే ఈ కధకు మూలం.) •




'ఏమండీ! ఓ గులాబి కోసుకోనిస్తారూ!'

రాసుకుంటున్న వాడిని తలెత్తి చూశాను—

రెండు జళ్ళు. పీలం ప్రాకువేసుకొని. తెల్లగాబొద్దుగా ఆరేడేళ్ళమ్మాయి ఎదురుగా నిల్చొంది. భయపడుతున్న కళ్ళతో ఉన్న ఆ అమ్మాయిని చూస్తే ముద్దేసింది. ఆ పిల్లని అంతకు ముందెన్నడూ మా యింటి ప్రాంతాల్లో నేను చూడలేదు!

'ఎవరమ్మాయివమ్మా నువ్వు'— చిన్నగా నవ్వుతూ అడిగేను.

'రాజారావు గారమ్మాయినండీ మా నాన్నారు బ్యాంక్‌లో పన్జేస్తారు. మా నాన్నారికి ట్రాన్స్ఫరయితే గుంటూరు నుంచొచ్చాం అదే మా ఇల్లు' ఆ అమ్మాయి గబ గబా చెప్పేసింది ఎదురుగా ఉన్న యిల్లు చూపిస్తూ.

మా వాకిట్లో గులాబిచెట్టు ఆ రోజే పూయడం మొదలెట్టింది. మొదట పూసిన పూలు దేవుడికి పెట్టాలని. ఆ చెట్టు మొగ్గలేసినప్పటి నుండి మా అమ్మ అనుకుంటున్నది. కాని, అమాయకంగా అడుగుతున్న ఆ పిల్లని చూస్తే 'వద్దు' అని చెప్పలేక పోయాను ఆరోజు విచ్చిన పూలలో ఒకటి కోసి ఆ పిల్ల కిచ్చాను.

'నీ పేరేంటి పాపా!'—అన్నాను ఆ అమ్మాయిని దగ్గరకు తీసుకుంటూ.

'రాధ'—చక్రాల్లా కళ్ళు తిప్పింది.

'నీకు గులాబి ఇచ్చాను మరి నాకేం ఇస్తావ్'—అన్నాను ఆ పిల్ల మొహం లోకి చూస్తూ.

'నా దగ్గరేముంది ఇవ్వటానికి.' ఆ పిల్ల జాలిగా మొహం పెట్టింది.

'ఒక్క ముద్దిస్తావా!'

'ఓ!' అంది రాధ.

రాధని ఓ ముద్దెట్టుకున్నాను.

'వస్తానండీ. నేను బడి కెళ్ళాలి. మళ్ళీ రేపొస్తాను. నవుస్తే'—అంటూ తుర్రున పరుగెత్తింది రాధ.

నాకు ఆ అమ్మాయిని చూస్తే ముచ్చ టేసింది. ఒక్క క్షణం నా మనసులో చచ్చిపోయిన మా చెల్లాయి జానీ మెదిలింది.

నా తర్వాత చాలాకాలానికి మా ఇంట్లో జానకి పుట్టింది. అప్పటిదాకా ఒంటరి గాడినైన నేను, నాకూ ఓ చెల్లెలు పుట్టే సరికి విపరీతంగా సంబర పడిపోయాను అతి గారాబంగా మా జానకిని పెంచాం. కాని విధి మా ఆనందాన్ని చూసి ఓర్చ లేకపోయింది. జానకిని ఆరో సంవత్సరం జరుగుతుండగా మశూచివల్ల మమ్మల్ని వదిలి వెళ్ళిపోయింది.

జానకి పోవడంతో నేను దాదాపు పిచ్చి వాణ్ణయి పోయాను నాకు మళ్ళీ ఆ యింట్లో ఒంటరి జీవితం ప్రారంభమైంది మానసికంగా అమ్మ గూడా బాగా క్షీణించి పోయింది. పైకి కనబడకుండా నాన్నగారు లోలోపలే కుమిలిపోయారు మేము జానకిని పూర్తిగా మర్చిపోవడానికి చాలా కాలం పట్టింది.

అప్పటినుండి చిన్న పిల్లలను చూసి నప్పుడల్లా మాకు చాలాసరదాగా ఉండేది. రాధని చూసిన మొదటి క్షణంలోనే నాకు ఆ పిల్లలో మా జానకి కనిపించింది.

అలా గులాబితో పరిచయమైన రాధ ప్రతిరోజూ మా ఇంటికి వచ్చేది నేను రోజూ గులాబీలు కోసిస్తూండేవాణ్ణి. రాధ నాకు రోజూ ఓ ముద్దు ఇస్తూండేది. మా ఇంట్లో పిల్లలానే రాధ మాతో బాగా కలిసి పోయింది.

ఒకరోజు రాధ నన్ను వాళ్ళింటికి పిల్చుకెళ్ళింది. వాళ్ళ నాన్నగారిని అమ్మ గారిని నాకు పరిచయం చేసింది.

'మా రాధ ప్రతిరోజూ మీకు ఓ పెద్ద 'న్యూసెన్సు' అయిపోయిందనుకుంటాను' అన్నారు రాజారావుగారు నవ్వుతూ.

'అలా ఎప్పటికి అనుకోకండి. రాధను చూస్తుంటే పోయిన మా జానకి గుర్తు కొస్తుంది. రాధ ఒకరోజు రాకపోతే మా

కేం తోచదు' అన్నాను నేను.

రాధవల్ల మా రెండు కుటుంబాలు బాగా సన్నిహితమై పోయినయ్. రోజూ నేను రాధకి గులాబీ లివ్వడం. రాధ నాకు ముద్దివ్వడం అలవాటయి పోయింది.

'మిమ్మల్ని మామయ్యా! అని పిలుస్తాను మీరేం అనుకోరుగా' అంది రాధ ఓ రోజున నా టేబిల్‌మీద నిల్చొని

నాకు చాలా ఆనందం వేసింది.

'నేనేం అనుకోను రాధా! నీ యిష్ట మొచ్చినట్లు పిలు' అన్నాను.

ఆ రోజునుండి రాధనన్ను మామయ్యా అని పిల్చేది. గంటల కొద్దీ ఏవేవో కబుర్లు చెపుతూ మా ఇంట్లోనే గడిపేది.



'మామయ్యా! 'అపోలో' లో చందమామ దగ్గరకెళ్ళటానికి టిక్కెట్లు ఎంత?' అంది రాధ ఓ రోజు

నాకు నవ్వొచ్చింది

'ఎంత టికెట్టు పెట్టాలో ఇంకా తేల్చలేదు.' అన్నాను. ఆ పసిహృదయానికి అంతకంటే ఎలా చెప్పాలో నాకు తెలియలేదు.

"రేడియోలో మనుషులు కూచుని మాట్లాడతారా! 'చైనావాళ్ళు మనతో ఎందుకు యుద్ధం చేస్తున్నారు? నెహ్రూగారికి పిల్లలంటే ఎందు కిష్టం? ఆయనకి పిల్లలు లేరా!-గాంధిగారికి గుడ్డలు లేవా. ప్రతి ఫోటోలోనూ ఒక్క పంచెతోనే కనిపిస్తారు?..."

ఇలా రకరకాలుగా రాధ అనేక ప్రశ్నలు వేసేది. అన్నిటికి ఏవో సమాధానాలు చెప్పి ఆ పసిహృదయాన్ని సంతృప్తి పరుస్తూండే వాణ్ణి

సంవత్సరం గడిచిపోయింది—

నా ఇంజనీరింగ్ కోర్సు పూర్తయింది. వార్తేరులోనే ఉద్యోగంలో చేరాను

ఆ రోజు ఉదయం పది గంటలైంది రోజూ నిద్రలేవగానే గులాబీల కోసం వచ్చే రాధ ఆరోజు పదిగంటలయినా రాక పోయేసరికి రాధకోసం ఉంచిన గులాబీలు తీసుకొని వాళ్ళింటికి వెళ్ళాను.

'రండి రాధకి తీవ్రంగా జర్వం తగిలింది. అందుకే ఇవాళ రాలేకపోయింది'-నన్ను చూడగానే రాజారావు గారన్నారు.

గదిలో మంచంమీద రాధపడుకొనుంది.

'రా మామయ్యా! ఇవాళ జ్వరం తగ్గింది. అందుకే రాలేకపోయాను. బడికి కూడవెళ్ళలేదు. గులాబీ తెచ్చావా!' అంది





రాధ నీరసంగా.

రాధ మంచంమీదే నేనూ కూర్చున్నాను. నే తీసికెళ్ళిన గులాబీలు అంత జ్వరంలోనూ తల్లో పెట్టుకుంది.

'జ్వరం 102 దాకా ఉందండి. ప్రొద్దునే డాక్టర్‌కి చూపించాను. ఆయన ఇంజక్షన్లు, టేబ్లెట్లు యిచ్చారు' అన్నారు రాజారావుగారు.

నేను కాసేపు కూర్చోని వచ్చేశాను.

అలా ప్రారంభమయిన జ్వరం చివరికి టైఫాయిడ్‌లోకి దిగింది. రోజూ కేప్సిల్సు, ఇంజక్షన్లు ఇస్తున్నాడు.

టైఫాయిడ్ అనేసరికి నా గుండె దడదడలాడింది. ఆ రోజు నుండి నాకేం తోచలేదు. నిద్ర లేవగానే నవ్వుతూ కనిపించే రాధ, రోగిగా పీక్కుపోయిన మొహంతో మంచంలో పడుకుంటే నాకు చాలా బాధేసింది. ఒక్కసారి పక్కలో పడుకున్న జానకి కళ్ళలో మెదిలింది. నా గుండె ఝల్లుమంది. రాధకి త్వరగా జ్వరం తగ్గించమని చిన్న పిల్లాడిలా భగవంతుణ్ని ప్రార్థించాను.

రోజూ ఆఫీసు నుంచి రాగానే రాధ మంచం ప్రక్కనే కూర్చునేవాణ్ని. పొద్దుపోయిందాకా అక్కడే ఉండి ఏవో కబుర్లు చెప్తూ రాధ నిద్ర పోయిం తర్వాత నేను ఇంటికొచ్చేవాణ్ని.

'మావయ్యా! నాకీ జ్వరం తగ్గదా-' అంది రాధ కన్నీళ్ళతో. జ్వరం తగిలి అప్పటికి పది రోజులు.

ఆ మాటలు వినగానే నాకు చాలా బాధేసింది. 'ఛ! ఊరుకోమ్మా! తగ్గకేం చేస్తుంది. ఇహ రెండ్రోజుల్లో పూర్తిగా తగ్గిపోతుంది. తప్పు! ఏడవకూడదూ!-

అన్నాను రాధ కన్నీళ్ళు తుడుస్తూ.

'నాకు హాయిగా తిరగాలనుంది మావయ్యా! మన గులాబి చెట్టు చూసి చాలా రోజులయింది. మా బళ్ళో పాఠాలన్నీ అయిపోతుంటయ్. మళ్ళీ అవన్నీ నాకెవరు చెప్తారు' అంటూ భోరున ఏడ్చేసింది.

కాసేపు రాధని ఊరడించి నేను వచ్చేశాను. తర్వాత కొద్ది రోజులకే రాధకి జ్వరం తగ్గుముఖం పట్టింది. పథ్యం తిన్న రాధ క్రమ క్రమంగా కోలుకోడం ప్రారంభించింది. దాదాపు నెల రోజులకిగాని రాధ మొహంలో వెనకటి కళ రాలేదు.

రాధ మంచమెక్కినప్పటి నుండి నేనే రోజూ గులాబీలు తీసుకెళ్ళి ఇస్తుండేవాణ్ని. అంత జ్వరంలోనే నేను గులాబీలు తీసుకు రాకపోతే చాలా బాధపడేది. అందుకే క్రమం తప్పకుండా తీసికెళ్ళేవాణ్ని. జ్వరం తగిలినప్పుడు పూలు పెట్టుకో గూడదంటే, పక్కనే పెట్టుకుని చూసుకుంటాననేది. ఆమెకూ గులాబీలకి గల బంధం అలాంటిది.

గులాబీల కోసం రాధ వెనుకటిలాగా మా యింటికి రావడం మళ్ళీ మొదలయింది.

'బళ్ళో పాఠాలు యీ నెల రోజుల్లోనూ చాలాఅయిపోయాయ్ మావయ్యా! నాకు ఆ పాఠాలన్నీ చెప్పవూ! అని దీనంగా మొహం పెట్టి అడిగింది. ఆ చిన్న కోరికను కాదనలేకపోయాను.

ఆరోజు నుండి రాధకి రాత్రిపూట పాఠాలు చెప్పేవాణ్ని.

ఆయిదు నెలలు గడిచి పోయినయ్—రాధ మామూలుగా వెనుకటి రాధ అయింది. వెనుకటి చలాకీతనం, ఉత్సాహము రాధ మొహంలో కనిపించినయ్.

మార్చిలో నా పెళ్ళి నిశ్చయమైంది.

నా పెళ్ళి జరుగుతుందంటే రాధ సంతోషానికి హద్దులు లేకుండా పోయింది. పెళ్ళి పెద్దలాగా ఆ నాలుగు రోజులూ తెగ తిరిగింది. రాజారావుగారూ ఆయన భార్య కూడా నా పెళ్ళి తతంగం పూర్తయ్యే దాకా మా యింట్లోనే వున్నారు.

ఆ రోజు ఉదయం పది గంటలైంది.

పేపరు చూస్తూ వాకిట్లో కూర్చున్నాను. నీలం ఫ్రాక్ వేసుకుని బడికి పోతూ రాధొచ్చింది.

'ఏం రాధా పొద్దున్నే గులాబి కోసం రాలేదేం!' అన్నాను.

'ఇవ్వాళ్టినుంచి గులాబీలు నాకెందుకిస్తావయ్యా! అత్తయ్యొచ్చిందిగా—ఆమెకిస్తావ్. ఇక నుంచి మేము కనపడ్తామా. మాతో మాట్లాడతావా.' వెక్కిరింపుగా అంది రాధ.

రాధ మొహం చూస్తే నవ్వొచ్చింది నాకు.

'అలా ఎవరు చెప్పారు నీతో.'

'ఎవరు చెప్పాలి నాకు తెలియదూ! పెళ్ళంటే ఏమిటి మావయ్యా- ''ఒకళ్ళతో స్నేహం తెంచేది మరొకళ్ళతో స్నేహం పెంచేది'' అని మొన్న మా టీచరన్నారు తెలుసా!'' అంది రాధ చేతులు తిప్పుతూ పెద్ద ఆరిందానిలాగా.

ఏడేళ్ళ రాధకి పెళ్ళి మీద అంత అభిప్రాయం వున్నందుకు నాకు ఆశ్చర్యం కలిగింది.

''ఇహ ఉపన్యాసాలాపి పువ్వు కోసుకుని బడికెళ్ళు. ఇప్పటికే పది గంటలు

దాటింది'' చిన్నగా మందలించాను.

'అదిగో చూశావా! అప్పుడే పరాయి వాళ్ళ మీద నిర్లక్ష్యం కనిపించింది. రోజూ నువ్వే పూలు కోసిచ్చేవాడివి. ఇవాళ 'కోసుకో' అన్నావ్! 'రేపు' పిల్లేదమ్మాయ్! మా ఆవిడకి కావాలి' అంటావ్-వ్-ఏం చేస్తాం-సరే కానీ వెళ్ళయినవాడివి నిన్ను కష్టపెట్టకూడదులే, ఇవాళే ఆఖరి పువ్వు కోసుకెళ్తా రేపట్నుంచి పూలకి కూడా రాను. అంటూ రాధ బయటికి పరుగెత్తింది

గులాబి కోసుకొని తల్లో పెట్టుకుని మళ్ళీ నా దగ్గర కొచ్చింది.

'వెళ్ళొస్తా మావయ్యా! టా! టా!'

'రాధా! నా మామూలేది!'

రాధ నా దగ్గరగా వచ్చింది.

'ఇంకా మా ముద్దులెందుకు బాబూ! సరే కానీ!-ఇదే ఆఖరి ముద్దు. రేపట్నుంచి నేను ఇవ్వను-నువ్వు పూలివ్వవు!

రాధ పదే పదే అలా అనటం నాకు కొంచెం బాధ కలిగించింది. అసలాపూట రాధ ప్రవర్తనే నాకు వింతగా తోచింది.

'తప్పు రాధా! అలా మాట్లాడకూడదు. ఏం జరిగినా మన స్నేహానికి ఆటంకం కలగదమ్మా' అంటూ ఆప్యాయంగా ముద్దెట్టుకున్నాను.

'మావయ్యా!' రాధ కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్.

'నిజంగానా మావయ్యా! అత్తయ్య రావడంవల్ల నువ్వు నాతో ఎప్పటిలాగా మాట్లాడవనుకున్నాను. నాకు గులాబీలు ఇహ మంచి ఇవ్వవనుకున్నాను నిజంగా నాకు రోజూ మామూలుగా గులాబిలిస్తావా!' రాధ ఏడ్చేసింది

రాధ కళ్ళనీళ్ళు చూస్తే నా కళ్ళలో కూడా నీళ్ళు తిరిగినయ్.

'రాధా! తప్పు. అలా ఏడవకూడదు' రాధని కాసేపు సముదాయించాను. నేను లోపలే దిగమింగుకుంటూ.

'నన్ను మర్చిపోనని ఒట్టేయ్'-రాధ కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది.

అలాగే రాధా! నిన్ను జీవితంలో మర్చిపోను' ఆ పసిచేతులో చెయ్యివేసి తృప్తిపరిచాను.

'వస్తామావయ్యా పదిదాటింది టా! టా'—అంటూ రాధ బయటకు పరుగెత్తింది.

రాధను చూస్తే నా హృదయం ఆ వేదనతో కొట్టుకులాడింది రాధ ఎవరు?— నేనెవరు? కేవలం గులాబీలతో ప్రారంభమయిన మా పరిచయం విడదీయని అనుబంధంగా నిలిచిపోయింది.

రాధనిగురించి ఆలోచిస్తున్న నేను బయట ఏదో గొడవ, కేకలు వినబడ్డంతో బయటకు వెళ్ళాను

లారీకింద ఎవరో పడిపోయారని జనమంతా గుమికూడారు. కొంచెం దూరంలో ఓలారీ ఆగివుంది.

'లారీకిందపడ్డదెవరు' - ఒకాయన్ని అడిగాను. ఆయన ఎవరో ముసలాడన్నారు. మరోకాయన కాదు ఎవరో కాలేజి స్టూడంటన్నాడు. ఇలా రకరకాలుగా ఎవరికితోచింది వారు చెప్తున్నారు.

జనాన్ని తోసుకుని ముందుకెళ్ళా.

ఎదురుగా కనిపించిన దృశ్యం చూసేసరికి నా తల తిరిగిపోయింది. భూమ్యాకాశాలు ఏకం అయినట్లనిపించింది.




నెత్తురు ముద్దగా జనం మధ్యలో రాధ పడి ఉంది.

మెళ్లో పుస్తకాల తెల్లనంచి. తల్లో గులాబి వీరంప్రాపు-అన్నీ నెత్తురుతో తడిసిపోయినయ్ మెడ మధ్యగా చైరు పోవడంతో గుడ్లు బయటకొచ్చి అందాలు చిందే నా రాధ మొహం భయంకరంగా ఉంది.

'రాధా!'—అని కేక పెట్టడం మాత్రం నాకు తెలుసు తర్వాతేం జరిగిందో నాకు తెలియదు.

నేను కళ్ళుతెరిచి చూసేటప్పటికి అమ్మ విసనకర్రతో విసురుతున్నది. నా భార్యా, నాన్నగారు కొంచెం దూరంలో నిల్చొన్నారు.

నేను చూసిన భయంకర దృశ్యం కలలో అనుకున్నాను. కాని అదికలకాదు! నిజమే!

బడికి త్వరగా వెళ్ళాలని పరుగెత్తిన రాధ. పక్కనుండి వేగంగా వస్తున్న లారీని చూడలేదు.

ఏ నిమిషాన రాధ ఆమాట అన్నదో అది అక్షరాలా నిజమైంది! ఆ రోజు నే నామెకిచ్చిన ఆఖరి గులాబి ఆమె నాకిచ్చిన ఆఖరిముద్దు.

రాధ మరణంతో నాలో ఏర్పడ్డ, ఆ వేదననూ, బాధనూ, దుఃఖాన్నీ ఎలా అణుచుకోవాలో అర్ధంకాలేదు. మానసికంగా చాలా కృంగిపోయాను. ఏపని చేస్తున్నా రాధ నవ్వు మొహం కనిపించేది. రాధతో అలవాటయిన ఆ వాతావరణంలో ఉండలేక, కొన్నాళ్ళు శలవుపెట్టి అక్కడా, ఇక్కడా తిరిగాను. ఇంతలో నాకు హైద్రాబాద్ ట్రాన్స్ఫరయింది.

రాధ పోవడంతో రాజారావుగారి గుండె బద్దలైంది. ఆయన భార్యాదిగులుతో మంచంపట్టి కొద్దిరోజులకే ఆయన్ని పూర్తిగా ఏకాకిగాచేసి పోయింది. ఒకదానివెంట మరొకటిగా తగిలిన దెబ్బలతో రాజారావుగారు కోలుకోలేక పోయారు. మానసికంగా పూర్తిగా చెడిపోయి పిచ్చివాడిగా

తన తమ్ముడుదగ్గర నెల్లూరులో ఉన్నారు.

స్వంత చెల్లెలు జానకి పోయినపుడు త్వరలో కోలుకో గలిగాను. కాని రాధని మరిచిపోలేక పోయాను. ఆమెతో నాకు కలిగిన పరిచయం, మా మధ్య పెనవేసు కున్న అనుబంధం అలాంటిది.

నేను పెళ్ళి చేసుకోబోతే రాధ నాకు దక్కేదేమో రాజారావుగారి జీవితం కుటుంబం నా శవం కాకుండా ఉండేవేమో అని నాకు ఈ నాటికీ అనిపిస్తుంది.

'పెళ్ళి ఒకళ్ళతో స్నేహం పెంచు తుంది-మరోకళ్ళతో స్నేహం తెంపు తుంది,-అని రాధ చెప్పిన మాటలు నిజమే ననిపించినయ్!




నేను రాధని మర్చిపోలేను. ఆమె నా జీవితంలో చెరగని ముద్ర వేసింది. చిన్న పిల్లలు దేవుడితో సమానమన్నారు. నే నామెను దేవతగా కొలుస్తాను. అందుకే నేను రోజూ ఆమె ఫోటోకి ఓ గులాబీని సమర్పిస్తాను ఆమెమీద ఏర్పడ్డ ఈమమత ఏనాటి పూర్వజన్మ ఫలమో నేను చెప్ప లేను.

• • •

రాంబాబు కళ్ళు తుడుచుకుని మళ్ళీ ప్రారంభించాడు.

'పెళ్లి చేసుకున్న తర్వాత ఆమెను మరచిపోతాననే భ్రమనూ, అనుమానాన్ని పోగొట్టటానికి ఇప్పుడు రాధలేదు' ఆమె ఆత్మయినా నన్నర్థం చేసుకుంటుందనే ఆశతో మా పెద్దబ్బాయికి 'రాధాక్రిష్ణ' అని పేరు పెట్టుకున్నాను. ఆమె జ్ఞాపకం అనుక్షణం నాతో ఉండాలనే ఇలా నా జేబు రుమాళ్ళ మీద గులాబీలు కుట్టిం చాను.'

రాంబాబు కళ్ళనుంచి నీళ్ళు జలజలా రాలాయ్ 'నీ జేబురుమాళ్ళ మీద గులాబీ పూలెందుకు కుట్టించావ్' అని నేను సరదాగా అడిగిన ప్రశ్న వెనుక ఇంత కథ దాగుందనుకోలేదు.

'నన్ను క్షమించు రాంబాబూ! నే నడిగిన సరదా ప్రశ్న నీగత స్మృతులు తవ్వి నీకు బాధ కలిగిస్తుందనుకోలేదు. అయామ్ సో సారీ!' అన్నాను.

రాంబాబు విర్వికారంగా ఓ నవ్వు నవ్వాడు. •

చదువు చెప్పించుకోడం కోసం వసతి గృహంలో వుండడం అలవాటైనా, ఇప్పుడు చదువు చెప్పడం కోసం మరో వూరు వచ్చి స్వతంత్రంగా యిల్లు తీసుకొని జీవితం గడపడం కొంచెం బెరుకుగానే అనిపించింది. ఇల్లు సందడిగా వుంది. ప్రక్కభాగం వాళ్ళ పిల్ల పాపలతో కాంపౌండునిండా పూల మొక్కలు పరపరా చేసున్న చల్లని గాలి సువాసనని కూడా మోసుకొస్తోంది. గనుక వాతావరణం ఆహ్లాదకరంగానే వుందని వొప్పుకోక తప్పదు ఎటొచ్చీ వొంటరితనం అలాగే మిగిలిపోయింది. దాన్ని తీర్చేవారెవరు గనుక?

కాలేజికి వెళ్ళడం. పాఠాలు చెప్పడం. అక్కడ ఉపన్యాసకురాంద్రతో హాయిగా కబుర్లాడడం, చర్చించడం, అంతవరకూ సుఖంగానే వుంది. కానీ యింటికి క్యారియర్ తెచ్చి పెట్టేవాళ్ళూ, గదీ. వరండా శుభ్రం చేసిపెట్టేవాళ్ళూ దొరకనేలేదు.

మూడు రోజులైనా.

ఇప్పటి నాగరికత ప్రభావమే కాబోలు నా బాగోగుల అవసరం పొరుగువాళ్ళకి పట్టనేలేదు.

ఆ సాయంత్రం. నా ఒక్కగానొక్క ఫర్నిచర్ అయిన పేము కుర్చీని వరండాలో వేసుకుని, వోప్పైపుతో చెట్లకి నీళ్ళు పెడుతూన్న పక్కింటి వాళ్ళ పదేళ్ళ అమ్మాయిని చూస్తూ కూర్చున్నాను ఆ అమ్మాయి కట్టుకున్న నల్ల పరికిణీమీద జరీగళ్ళు సూర్య కిరణాల్లాగ మెరుస్తున్నాయి. నీరెండలో - ఆ అమ్మాయి కళ్ళు తెల్లగా వున్నాయి. అమాయకత్వం పేరుకుపోయినట్లు.

"పరికిణీ తడుపుకోకే చిట్టీ! ఆ పని పిల్లకి అప్పచెప్పి నువ్వొచ్చి చదువుకో" అని గర్జించింది ప్రక్కింటి ఇల్లాలు.

గేటు త్రోసుకొని లోపలికి వచ్చింది పని పిల్ల.

చక్కగా దిద్దిన కాటుకతో మరింత విశాలంగా వున్నాయి దాని కళ్ళు. మాసిన పరికిణీ బొడ్లో దోపి. 'చిట్టి' చేతిలో ట్యూబు అందుకుంది.

అలా అందుకుంటూనే. "అమ్మాయి గోరి పరికినా ఎంత బావుంది!" అని కళ్ళు పెద్దవి చేసి దీర్ఘం తీసింది.

"నీ మొహం నీ కన్నా బాగానే వుంటాయి." అన్నది చిట్టి.

"కాదు పిట్టెమ్మగోరూ! ఈ పరికినా చానా చానా బావున్నది." నొక్కి నొక్కి పలికింది 'పని మనిషి'.

చిట్టి చేతిలో వస్తువును 'పనిమనిషి' కి అప్పజెప్పి రెండడుగులు ముందుకు వేసింది.

"ఎంతైంది పిట్టెమ్మగారూ." అన్నది మళ్ళీ ఆ పిల్ల.

"ఏమిటే నీ గొడవ! పరికిణీ ఖరీదా మవ్వడిగేది!" అన్నది చిట్టి ముఖం చిట్లించి.

"అవునమ్మా ఎంతెట్టి కొన్నారోనని అడిగా." ఖంగ మూతి పెట్టింది.

"అమ్మ నడిగొచ్చి చెబుతా."

"అయ్యబాబోయ్! అమ్మగారిని అడక్కండి. నన్ను తిట్టిగల్రు - అయినా వందేసి రూపాయల పరికిణీలు నా నెక్కడ కట్టగలను." అంది తల వంచుకుని.

"ఓసి పిచ్చి మొద్దూ! ఇది పట్టుకాదే. ఇమిటేషన్ సిల్కు. ఆడంబరంగా వుందని అమ్మ కొన్నది. వంద రూపాయలుండదు. ఇరవై కూడా వుందో లేదో!" దాని అమాయకత్వానికి జాలి పడ్డది చిట్టి.

"నిజమే!" పిచ్చిమొద్దు ఆశ్చర్యంతో ముఖం చింపి చేటంత చేసుకుంది.

చిట్టి లోపలికి వెళ్ళిపోయింది.

"ఏయ్ అమ్మాయ్ ఇలారా!" అని పిలిచాను.

ఆ అమ్మాయి వచ్చి దూరంగా నిలబడింది.

"నీ పేరేమిటి?"

"సుబ్బులు."

"మా యింట్లో పని చేస్తావా?"

ఒక్క నిముషం పరిశీలనగా నా ముఖం వంక చూసి.

"ఏవేం పన్లు?" అంది.

చెప్పాను.

"ఎంతిస్తారు?"

"నువ్వే అడుగు."

ఆకాశంలోకి చూసి అంకెలు కూడినట్లు రెండు నిముషాలు పెద్దపెద్ద కళ్ళతో ఆకాశాన్ని చూస్తూ నిలబడి, "పది రూపాయలివ్వండి." అంది.

ఆ పిల్ల ముఖం చూస్తే బేరాలాడ్డం ఎవరికీ చేత కాదనిపించి, "సరే, ఇప్పుడు గది శుభ్రం చేసి కూజాలో నీళ్ళు పెట్టు" అన్నాను.

సుబ్బులు కదలకుండా వరండా స్తంభాన్ని కానుకొని అలాగే నిలబడింది.

"వెళ్ళూ." అన్నాను.

"సరే చేస్తాను గానీండమ్మగారూ-ఈ సంగతి ఎవరితోనూ అనమాకండి. ఈ ల్లింట్లో పనికొచ్చినప్పుడే మీకూ చేస్తాను మా సిన్నితోగాని, మా అయ్యతోగాని చెప్పకండి."

"ఎందుకని?" నిండా పదమూడేళ్ళు లేని ఆ పిల్ల ఆలోచనకి ఆశ్చర్యపడ్డాను.

"ఏమీలేదు. రెన్నెల్ల జీతం దాచుకుని పిన్నెమ్మగార్లాంటి పరికినా కొనుక్కుందామని!" అంటూ లోపలికి పోయి చీపురు తెచ్చింది సుబ్బులు.

కోరిక చిత్రమైనది. అది తీరడానికి అనేక ఉపాయాలు.

ప్రక్కింట్లో చిట్టి సినిమాకు వెళ్ళ తీరాలని పట్టుబట్టి రాగాలాపన సాగిస్తోంది.

"తీసుకెడతాను తల్లిగాదూ! ఏడవకమ్మా!" ఆ పిల్ల తండ్రి సముదాయింపు.

ఏళ్ళకి చిన్నదే అయినా సుబ్బులు పని చేయడంలో సిద్ధహస్తురాలు. అరిందాలా ఆ పిల్ల చేసే పన్లకి నేను ఆశ్చర్య పడకుండా వుండలేకపోయాను. ఆ వయస్సుదే అయిన నా చిన్న చెల్లెలు యింకా మొహం కడుక్కోడానికి నీళ్ళు సహితం ఎవరైనా యివ్వవలసిన స్థితి లోనే వుంది. సుబ్బులు పని చేయడం మొదలుపెట్టాక నా గది వరండా శుభ్రంగా వున్నాయి. క్యారియర్ తళ తళలాడుతోంది.

స్నానానికి వేన్నీళ్ళు అమరుతున్నాయి. ఆదివారం మధ్యాహ్నం స్థిమితంగా కూర్చుని పత్రికలు తిరగేస్తుండగా సుబ్బులు వచ్చింది.

"నాను పన్లోసేరి నెల్లైందాండమ్మగోరూ!" అన్నది రావడంతోనే.

"ఇంకా నాలుగు రోజులుంది!" అన్నాను.

"ఈ నెల జీతం మీకాడే వుంచండమ్మగారూ. నా కిమాకండి. మా అయ్య సూసిందంటే తన్ని లాక్కెల్తడు." అంది.

"మీ అయ్య అంత చెడ్డవాడా?"

"మరి తాగుబోతు నచ్చినోడు ఎక్కడ పైన కవపడ్డా ఎత్తుకుపోయి తాగేస్తాడు. అది నుకవే అదిది. మా పూసు అక్కర్నేదు" కసిగా అంది సుబ్బులు.

'పితృదేవోభవ' అనడంకంటే అన్యాయము మరొకటి లేదన్నది సుబ్బులు మాటలకి భాష్యం.

"నువ్వెంత సంపాయిస్తావ్?"

ఆ ప్రశ్నకి సుబ్బులు నవ్వింది.

'నెలకి ఇరవై తెత్తాను. కూటికే పాల్దు. మా నాయనమ్మున్నాది. అదొక పాతిక తెస్తాది. ఇద్దరం తానుకుతాగి వచ్చేపేద కార్ల షెడ్డుకాడ పడుంటాం. అక్కడే గుడిసేసిచ్చారు మా అయ్యకి షావుకారు. ఆ గుడిసెలోకి మమ్మల్ని రానీడు మా పిన్ని. తల్లిలేని పిల్లలంగదా నేనూ మా అక్కా. మంచీ చెడూ నాయనమ్మే సూస్తాది."

"మీ అయ్య మీ కష్టం సుఖం చూడదన్నమాట."

"సూద్దు అది కళ్ళు మూసుకుపోయాయి." మెటికలు విరిచింది సుబ్బులు.

వాడు మిమ్మల్ని చూడకపోగా మీ డబ్బులు కూడా లాక్కుంటాడా?"

"మా కర్మ కాలింది." సుబ్బులకి ఏడుపు వస్తుందనుకొన్నాను గాని, అది ఏడవలేదు. పదమూడేళ్ళకే దాని గుండె గట్టి పడింది. బ్రతుకుపట్ల విర్లిప్తమైన దృక్పథం ఏర్పడింది.

పనిచేసే వాళ్ళకి, చేయించుకునేవాళ్ళకి మధ్య ఆత్మీయత, గౌరవం, విశ్వాసం పెంపొందించడానికి జీతం సకాలానికి ఇవ్వడం ఒక్కటే కారణం కాదు—అప్పుడప్పుడు తినడానికి, కొనుక్కోడానికి డబ్బులు యిస్తూవుండడం, తీరిగ్గా వున్నప్పుడు వాళ్ళ బాగోగులు విచారించడం కూడా అవసరం. అని నేను అనుకుంటూ వుంటాను.

"మీ అమ్మ నీచిన్నప్పుడే పోయిందా?"

"నాకయిదేల్లప్పుడుపోనాది అప్పటినందీ మానాయనమ్మే సూస్తున్నాది. అదు మళ్లీ పెళ్ళిసేస్కున్నాడు గందా? పిన్ని మహా గయ్యాల్ది. మా అయ్య సంపాయించిన డబ్బులన్నీ గుంజి పిసినారిలా సూస్తది. అదు మాఇంట్లో జొరబడి అన్నీ ఎత్తుకుపోతాడు. మాకోసల్లేడిసిందా షెడ్డుకాడే వుంటాంగదా? ఎప్పుడైనా పిసినాకిపోడావన్నా మాకాడ పైసుండదు-అమ్మగారూ మీకు పుణ్యముంటాది-మీ జీతం అడి సేతులో పెట్టమాకండి." సుబ్బులు బ్రతిమిలాడింది.

"సరేలే" అన్నాను.

"ఒసేవ్ సుబ్బులూ ఎక్కడ చచ్చావే? ఇంకా ఇలూడవాలని తెలీదా?" పక్కింటి ఇల్లాలు గర్జించింది.

"వత్తున్నానమ్మగారూ."

పని గబగబ పూర్తిచేసుకుని పరిగెత్తింది సుబ్బులు—

'ఆవిడ ఇల్లెంత? ఆవిడిచ్చే జీతమెంత? మేమిచ్చేదాన్లో సగంలేదు. ఎంత చేసూ అక్కడేవుంటావేం? మేమిచ్చే డబ్బు డబ్బుకాదాయేం? క్యారియరులో

మిగిలే అడుగుబొడుగు మెతుకులే నీకంత ఇష్టమయాయా? రోజూ నీకు మేము గిన్నెల్తో అన్నం తో ద డం లే మా?" ప్రక్కింటి ఇల్లాలు పాయింట్లు మాట్లాడుతోంది

"ఇంటివాళ్ళతో చెప్పి ఆ గదికూడా మేమే తీసుకుంటాం వుండు అప్పుడే మవుతుందో ఇంటివాళ్ళు మాకు చుట్టాలే ఏమిటనుకున్నావో?" ఆవిడ నెమ్మదిగా మాట్లాడుతున్నానని అనుకుంటోంది కాబోలు.

నాకు నవ్వొచ్చింది.

నేను గదిలో వుండడం ఆవిడకి మొదటినుంచీ ఇష్టంలేదని గ్రహించాను. ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్కరకం కాంప్లెక్సు వుంటుంది. ఆవిడ అసలు చదువుకోకపోవడం కారణంగా నేనంటే ఆవిడకి ప్రెజుడిస్ అన్న సంగతి ఊహించగలిగి నవ్వుకున్నాను. నేనా గదిలో చేరిన క్రొత్తలో ఆవిడతో "రండి ఒకసారి" అని పిలిచాను.

"నాకు పెత్తనాలకి తిరగడం అలవాటులేదు. మావారు చూస్తే కోప్పడతారు" అనేసింది ఆవిడ చప్పున తరువాత వారంరోజులకి మరొకావిడతో, "అబ్బో మా ప్రక్కింటి లెక్చరర్‌కి ఎంత గర్వం అనుకున్నావ్? కళ్ళు నెత్తిమీదే వుంటాయి. పాతికేళ్ళు దాటినా ఇంకా పెళ్ళికాలేదుగానీ మిడిసిపాటుకి లోటులేదు." అని చెప్పడం విన్నాను. వచ్చిన చిక్కల్లా ఒక్కటే. ఆవిడ ఎప్పుడూ ఒకే స్థాయిలో మాట్లాడుతుంది. ఆస్థాయికి హెచ్చుతగ్గులుండవు. తను చాలా నెమ్మదిగా మాట్లాడుతున్నానను

కున్నప్పుడుకూడా ఆవిడ అదేస్థాయిలో మాట్లాడుతుంది.

సహస్రనామాలతో సుబ్బులు పని పూర్తయ్యేసరికి, నేను స్నానం ముగించి జరీ అంచున్న తెల్లని వెంకటగిరిచీరె కట్టుకుని జడ అల్లుకుంటూ బయటికి రావడం. నా కోసం సహోద్యోగినులైన లలితారావ్, సుందరీశాస్త్రి రావడం ఒకే సారి జరిగిపోయాయి. వాతావరణం మారి పోయింది. సుబ్బులూ, ప్రక్కింటి ఇల్లాలూ తెరచాటుకి తప్పుకున్నారు. మొన్నమొన్న విడుదలైన నవలలమీద వ్యాఖ్యానం మొదలుపెట్టింది శ్రీమతి లలితా రావ్. క్రొత్తసినీమాలేం వున్నాయని అడి గింది సుందరీశాస్త్రి. ఆవిడకి ఇద్దరు పిల్లలు వాళ్ళిద్దర్నీ హాయిగా అమ్మమ్మదగ్గర వుంచేసింది. వచ్చిన ప్రతి సినీమా చూడటం ఇంటికెప్పుడూ అతిధులని ఆహ్వానించడం ఆవిడ హాబీలట. సుబ్బు లుకీ, ప్రక్కింటి ఇల్లాలుకీ, లలితారావ్‌కీ సుందరీశాస్త్రికి ఎలా గడిచాయోగానీ నాకుమాత్రం తారురోడ్డుమీద సరికొత్త ఇంపాలా కారు వెళ్ళినట్లు సుఖంగా గడచి పోయాయి నెలరోజులు.

ఎం. ఏ. డిగ్రీ పుచ్చుకుని ఏడాదిపాటు ఇంట్లో వుండిపోయాక, మళ్ళీ కాలేజి లోకి అడుగుపెట్టడం పంజరంలోనుంచి పారిపోయిన రామ చిలుకకి హాయిగా మామిడితోటలోకి వచ్చినట్టుంది. మనిషికి ఉత్సాహం, వుండాలంటే చేతినిండుగా పని వుండాలి. ఎవరికోసమో బ్రతకడం కాక, తనదైన ఒక జీవితం, జీవించే సంధి వుండాలి.

ఆవేళ ఉదయం ఇల్లంతా శుభ్రంగా తుడిచి, చెదిలేసర్ది, ప్రక్కమీద దుప్పటి చక్కగా దులిపి, "ఏవండమ్మగారూ-" అని క్రీగంటితో చూసింది సుబ్బులు—

"ఏమివ్వాళ అంత హుషారొచ్చింది నీకు!" అనడిగాను.

నాలుగురోజుల క్రితమే వాళ్ళయ్య మస్తుగా తాగివచ్చి అన్నం పెట్టనందుకు దాని జుత్తుపట్టుకు వంచి నడుంమీద గుద్ది గుద్ది వదిలిపెచ్చిందా బ్రతికిందా కనుక్కోకుండా వెళ్ళిపోవడం జ్ఞాపకం వచ్చింది. వాళ్ళ పిన్నికి పాపం వేవిళ్ళట. ఇక్కడ ఛాకిరీ చేయడం కష్టంగావుందని పుట్టిం టికి 'సిరికాకళం' వెళ్ళిందట-

"అద వాల్లకే తింటానికిలేదు —
దీని ముకాన ఏంపెడతారు—
అంతా మాయనాటకం - ఈడనుంచి బాగా డబ్బు మూటకట్టుకుపోతడ"—

అన్నది సుబ్బులు.

"మరేండమ్మగారూ-ఇయాల్టికి నాను పన్లోజేరి రెండునెల్లైద్దిగదా!" అన్నది చివరికి.

"అదానంగతి! ఇప్పుడునీకు జరీ అంచు నల్లపరికిణా కావాలన్న మాట-" అన్నాను.

సుబ్బులు సిగ్గుపడుతూ నవ్వింది. వొత్తుగావున్న మెత్తటి జడని మెడ చుట్టూ చుట్టుకుని, "ఎంతబావుందండి అపంకినా! మరైతే ఆ గుడ్డ ఏ సాపులో దొరుకుద్దంటాయా!" అన్నది—

"నన్నుతెమ్మంటావేమిటి!" అన్నాను గబిక్కున.

"అమ్మగారు కానామంచోరు - మీ పన్లో జేర్నికాణ్ణుంచి నేను కడుపునిండా తింటున్నాను-. అన్నది సుబ్బులు. అల్లా అన్నప్పుడు దాని కళ్ళు మెరవడం

# ఏవిటి సార్ వెతుకుతున్నారూ




చూశాను—

ప్రక్కింట్లో గడియారం అరగంట కొట్టింది. అంటే ఎనిమిదిన్నర.

"స్నానానికి నీళ్ళు పెట్టు సుబ్బులూ!" అంటూ లేచి హడావుడిగా అద్దం ముందు నిలబడి తలకి నూనె రాసుకుందామని షెల్ఫ్‌లోనుంచి నూనె సీసా తీశాను.

గేటు తోసుకుని ఎవరో లోపలికి వచ్చారు. అతడు వేసుకున్న బట్టల్నిబట్టి ఏ బొగ్గుల దుకాణంలోనో కూలి మనిషని అనిపించింది. అతను ప్రక్కింటి గుమ్మంలో నిలబడి,

"ఏయ్ సుబ్బులూ!" అనిగావు కేక పెట్టాడు.

సుబ్బులు బాత్‌రూంలో వుంది. స్టౌ మీద వుండే చిన్న కూజా బిందెను జాగ్రత్తగా గుడ్డతో దించి తీసుకువెళ్ళి బక్కెట్లో గుమ్మరించింది.

"అమ్మగోరూ నీళ్ళు తోలిపాను. రండి-" అని కేకేసింది.

"ఒసేవ్ సుబ్బీ!" మళ్ళీ కేకపెట్టాడు వచ్చిన మనిషి.

ప్రక్కింటి ఇల్లాలు గజ్జెల పట్టాల చప్పుడు చేసుకుంటూ వచ్చి "ఏమిటయ్యా! ఆ గావు కేకలూ నువ్వూనూ!

సుబ్బులు మా ఇంట్లో లేదు-అది ఏడు దాటితే ఇక్కడుండదు. ప్రక్కింటికెళ్ళి అడుగు-ఎప్పుడూ అక్కడే దాని నివాసం మేంఎంత జీతం ఇచ్చినాసరే-" అన్నది.

"ప్రక్కింట్లో ఏటున్నాదమ్మ-ఎవరేన

కొత్తగా దిగినావేంటి?" అన్నాడు వాడు మళ్ళీ అక్కడే నిలబడి కదలకుండా.

"అయ్యో రామ! ఈ వివరాలన్నీ చెబుతూ కూర్చోడానికి నాకు టైమ్‌లేదు బాబూ! అందుకని నువ్వు దయచెయ్యి-" అని మళ్ళీ ఒక క్షణం ఆగి,

"నీకు తెలీదేమిట్రా సూరయ్యా! ఆవిడ ఆ భాగంలో జేరి రెండునెలలైంది. అప్పట్నుంచి మీసుబ్బులేగా పని చేస్తోంది! నీతో చెప్పలేదా ఏమిటి! ఆ డబ్బులన్నీ తీసుకుని హాయిగా సినిమాలు చూసేస్తోంది కాబోలు. అసలు ఈ మధ్య అది చాలా మారిపోయింది, చెప్పినమాటవిననేవినదు. ఇంకో నెల చూసి మా వూరునుంచే పని మనిషిని పిలుచుకొచ్చుకుందామని చూస్తున్నాను. అక్కడికి దీనికి నెలకిరవై రూపాయలిస్తున్నానా? మిగలిన అన్నం పెడుతున్నానా-" ఆవిడ వాగ్ధాటి నిరాఘాటంగా ప్రవహిస్తోంది. మనుష్యులని రెచ్చగొట్టటం అనేది చాలా గొప్ప నేర్పు ఆ నేర్పు అందరికీ వుండదు. అది ప్రక్కింటి ఇల్లాలికి ఉగ్గుతో అబ్బిన విద్య అనుకుంటే తప్పుకాదు - వాడు - సారీ సూరయ్య-గబగబ రెండడుగుల్లో నా గది ముందు నిలబడి, "ఒసేవ్ సుబ్బులూ!" అని గర్జించాడు.

సుబ్బులు బాత్‌రూంలో నుంచి వణికి పోతూ బయటికి వచ్చింది. వేటకాణ్ని చూసి బెదిరిపోయిన లేడిపిల్లలా కళ్ళు రెపరెప లాడించింది,

"నేను విస్మయంగా నిలబడి పోయాను.

"రాబయటికి!" అరిచాడు సూరయ్య.

"ఎందుకేటి?" ధైర్యం కూడగట్టు కుంది సుబ్బులు.

"ఈడ రెండునెల్ల కాణ్నించి పని చేస్తున్నావటగా! డబ్బంతా ఏంజేసినావ్?"

దాని సంపాదనమీద అధికారం వాడిదే అయినట్లు నిలదీసి అడిగాడు.

సుబ్బులు వణికే పెదవుల్తో ఏదో చెప్పాలని వ్యర్థప్రయత్నం చేసింది.

గదిలో తను వున్నంతసేపూ భద్రత వుంటుందని గ్రహించినట్లుంది సుబ్బులు. సూరయ్య గడప దాటి లోపలికి రాలేదు.

నేను గడప దగ్గర నిలబడి. "మా ఇంటి దగ్గర గోల పనికిరాదు - నేనెవరను కున్నావు - పదు అవతలకి" అన్నాను

"నా నేం గోలకి రానేదమ్మగారూ-నా బిడ్డ అద్దాన్నం నయించన్నేను-కళ్లు పెడిపోతుంటే నా కడుపు దయించుకు పోతాది-దాపిట్టం. ఏడవ పీయ్-" అని రెండడుగులు వెనక్కి వేశాడు. సూరయ్య గేటు దగ్గరికి వెళ్ళి అక్కడ ఇసుకలో కూర్చున్నాడు. వాడక్కడ కూర్చున్న కారణం అర్థం అయింది.

కాలేజికి టైం అయింది. గదికి తాళం వేసి బయటికి రాగానే చిట్టివచ్చి "మా చెట్టు రెండు తెల్ల గులాబీలు పూసింది. ఒకటి తీసుకోండి" అనిఇచ్చింది. పరికిణీ చాటుగా వాళ్ళమ్మ చూడకుండా.

సుబ్బులు నాతో బయటికి వచ్చింది వరండాదాటి ప్రక్కగుమ్మంలో కదిలింది.

మెరుపులా వచ్చి దాని జడ పట్టుకుని దయ్యం పట్టినట్లు బాదడం మొదలు పెట్టాడు సూరయ్య.

నేను స్థాణువులా అక్కడే నిలబడి పోయాను.

సుబ్బులు ఏడుస్తోంది.

"ఊరుకోరా సూరయ్యా ఎందుకు దాన్నలా బాదుతావ్?" అంటూ బయటికి వచ్చింది ప్రక్కింటి ఇల్లాలు.

"నేనింకా జీతం తీసుకోలేదమ్మ గారూ-సచ్చపమాణికం-నా మాట అడు నమ్మడు-' ఏడుస్తూ వెక్కిళ్ళ మధ్య చెప్పింది సుబ్బులు.

"దాన్ని కొట్టావంటే అయ్యగారితో చెప్పి జైల్లోతో యిస్తాను-పదులు ముందు" గర్జించింది ప్రక్కింటి ఇల్లాలుమళ్ళీ.అవిడ పోలీసు ఇన్స్పెక్టరుగారి భార్య. సూరయ్య చప్పున దాని జడవదిలి అలాగే నిలబడ్డాడు. కుప్పలా నేలమీద కూలబడింది సుబ్బులు.

"ఏడవకు సుబ్బులూ-నీకొచ్చింది నల్ల పరికిణీయేగదూ!" అంటూ దగ్గరగా వచ్చింది చిట్టి. బహుశా సుబ్బులు కళ్ళ ముందు జరీ అంచు నల్ల సిల్కు పరికిణీ చిరిగి ముక్కలు ముక్కలైనట్లూ, దాంట్లో జరీగళ్ళు కళ్ళముందు ఒక్కసారి మెరుపుల్లా మెరిసి అంతర్ధానమైనట్లూ కనపడుతోందేమో.

"సూరయ్యా ఇదిగో జీతం నువ్వే తీసుకువెళ్ళు-దాని ప్రాణాలు మాత్రం తియ్యకు-అది బ్రతికివుంటేనే ఎప్పుడైనా నీకు త్రాగడానికి అర్ధరూపాయి దబ్బులు యిస్తూ వుంటుంది. చచ్చిపోతే ఎవరిస్తారు?" అన్నాను బ్యాగ్‌లోనుంచి డబ్బు తీసి వాడి మొహానకొట్టి-అభిమానం అనే మాటకి అర్థం తెలియని వాడిలాగా డబ్బు చేతిలో పెట్టుకునివెళ్ళిపోయాడు సూరయ్య.

ఏడవకు సుబ్బులూ,నాపరికిణీ కొంచెం పాతదికాగానే పికేయిస్తాలే- పోనీ ఒక పని చెయ్యనా? రేపు దాన్ని బ్లేడుతో కొంచెం చించి, అమ్మతో చిరిగిపోయిందని చెప్పి నీకు ఇచ్చేస్తాలే-" సుబ్బులు భుజంమీద చెయ్యి వేసింది చిట్టి.

సుబ్బులు కళ్ళు మెరిశాయి. చిట్టిలాగ "సుబ్బులూ ఏడవకు-నీకు నేను క్రొత్త పరికిణీకొని తెస్తాను" - అని నేనెందుకు వెంటనే అనలేక పోయాను? నాకే అర్థం కాలేదు. చిట్టికీనాకూమధ్యవున్న సంస్కారంలో తేడాను గురించి ఆలోచిస్తూ బస్ స్టాప్ కేసి నడిచాను.



# ప్రగాఢం బ్రహ్మచర్యం ప్రచండం సాగరం

వై. రాంబాబుశాయి

అతని కెవ్వరూ లేరు.

అమ్మ కడుపులో అయిదు నెల్ల గుడ్డుగా ఉండగానే తండ్రి పోయాడు.

అమ్మ కడుపులోంచి తను బయట పడగానే ఆవిడ కన్ను మూసింది.

అతని ముందెవ్వరూ పుట్టలేదు.

అమ్మా నాన్న కులాలు మరచి పెళ్ళి చేసుకున్నారు గనుక అయిన వాళ్ళందరూ దూరమైపోయారు.

ఆ విధంగా అతని కెవ్వరూ లేరు.

అనాథాశ్రమంలో పెరిగాడు.

ఆలనా పాలనా లేకుండా అడవిలో చెట్టు మాదిరి పెరిగాడు. జ్ఞానం తెలిసే వరకూ అతను అడవిలో ఉన్నట్టుగానే ఉన్నాడు. ఎప్పుడో ఓసారి బాగా జ్వరం

వచ్చి. తగ్గ ముఖం పడుతున్నప్పుడు "అమ్మ లేని బతుకింతే!" అనుకున్నాడు.

అప్పట్నించీ అతనికి అమ్మ గురించి దుఃఖం పట్టుకుంది. బిడ్డకు పాలిస్తున్న అమ్మ బొమ్మ, దూడ పాలు తాగుతున్న పుడు బిడ్డ శరీరాన్ని ప్రేమగా నాలికతో స్పృశించే ఆవు రూపం, జోలపాటా, పసిబిడ్డ నవ్వూ అతని కప్పుడప్పుడూ బాధ కలిగించేవి.

అతను తూర్పు గోదావరిలో అమూల పాశర్లపూడిలో పుట్టాడు అవూరు వెళితే అతన్నెవరూ గుర్తుపట్టరు. అతనా వూరు చూసి పాతికేళ్ళయింది. ఎప్పుడూ అక్కడికి వెళ్ళాలనిపించదు.

మనుషులతో కలిసి తిరగడం అతనికి మహాభయం. నలుగురున్న చోట చేరడు. ఎవరితోనూ మాట్లాడడు. తన కెవరూ లేరన్న దిగులు అతనికి నలుగురి ముందూ ఒక విధమైన భయాన్ని నేర్పింది. ఎవరి అనురాగాన్ని రుచి చూడని దురదృష్టం అతనిలో విపరీతమైన 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్'ను పెంచింది.

ముఖ్యంగా అతనికి ఆడవాళ్లంటే భయం. ఆడపిల్లను చూస్తే అతను తాచు పామును చూచినట్టు దడుసుకుంటాడు. ఆ విపరీతమైన భయం వల్ల అతనిలో ఆడవాళ్ళంటే ఒక విధమైన అసహ్యం కూడా పేరుకు పోయింది.

అతను అనేక గండాలకు లోనై బతికున్నాడు. ఎప్పుడూ ఆలోచిస్తూండడం వల్ల తనలో తను మాట్లాడు కోడం అలవాటైంది. దానివల్ల పరధ్యానం. నడిరోడ్డు మీద ఏదో ఆలోచిస్తూ, మాట్లాడుకుంటూ, బహిర జ్ఞానం లేకుండా నడుస్తూ ఉంటే, బస్సులూ రిక్షాలు అతని మీదికి దూసుకుంటూ వచ్చేవి తడబడేవాడు. చేతులూ, కాళ్ళూ రాసుకు పోయేవి. ఒకటి రెండు సార్లు అతను చావుకు అతి సమీపంగా వెళ్ళిపోయాడు. అదృష్టం బాగుంది గనక, అతను బతికి బయట పడ్డాడు.

ఎవరో పుణ్యాత్ముడు, తానెవరో ఎవరికీ తెలీకుండా, అతిగుప్తంగా అతని వెనక నిలబడి, అతన్ని బి. ఏ. వరకూ చదివించాడు. ఉద్యోగంకూడా వేయించాడు.

ఆఫీసులో అతనికి పెద్దపనేమీ ఉండేది కాదు. ఏవో మామూలు ఉత్తరప్రత్యుత్తరాలు ఉండేవి. అదైనా అతను సరిగా చేసేవాడుకాదు. సవాలక్ష తప్పులు రాసేవాడు, రాస్తూ రాస్తూ మధ్యలో ఆగిపోయి, ఏదో ఒక మాటకోసం తల బద్దలు కొట్టుకునేవాడు.

పాపం! అతనంటే ఎవరూ గౌరవం చూపించేవారు కాదు. ప్యూనుకూడా అతని మాట వినిపించుకొనేవాడు కాదు. పైగా అతని ముఖంమీదే అందరూ విరగబడి నవ్వేవారు అందుకతను పైకి ఏమీ అనేవాడు కాదుగాని, లోపల్లోపల విసుక్కొచ్చేవాడు.

"నన్ను చూస్తే వీళ్ళంతా ఎందుకిలా ఎగతాళి చేస్తారు? నేనంటే వీళ్ళకింత లోకువెందుకు? నా ముఖంలో ఏమైనా దయ్యాలున్నాయా? నాకేం తక్కువైందని వీళ్ళంతా పగలబడి నవ్వుతున్నారు?" అంటూ ఆలోచించుకుంటూ గంటల తరబడి కూర్చునేవాడు.

ఆఫీసుటైమ్ అయిపోయినాగాని అతను

యింటికి వెళ్ళేవాడుకాదు. చీకటి పడిపోయినా ఏదో ఆలోచించుకుంటూ కూర్చునేవాడు. తెరిచిన ఫైలు ఎదురుగానే ఉండేది. అక్షరమ్ముక్క రాసేవాడుకాదు. ఆలోచనలు మాత్రం పరిపరి విధాల పరుగులు పెట్టేవి.

కడకు వాచ్‌మన్ విసుగెత్తి, "రాసింది చాలుగాని-ఇంకలేచి వెళ్ళు! అప్పుడే ఎనిమిదైంది, ఎంత పెళ్లాం బిడ్డలు లేకపోతే మాత్రం ఇల్లాకూచుంటే ఎలా?" అంటూ కసురుకుంటే అప్పుడతను లేచి, ఫైళ్ళు సర్దుకుని కాళ్ళీడ్చుకుంటూ రోడ్డుమీద పడేవాడు.

అతను టౌనుకు దూరంగా ఒక మురికివాడలో మారు మూలగదిలో ఉంటాడు. అతనికి ఆ గదంటే చాలా యిష్టం. ఆ గదిలో కూచుంటే ఎప్పుడు తెల్లవారిందో చీకటెప్పుడు ముసురుకు వచ్చిందో తెలీదు. ఆ గదికీ వెలుతురుకూ బద్ధవైరం. గది ఎదుట, కిటికీకి బాగా దగ్గరగా [illegible]. బాగా ఎదిగిన అశోక వృక్షం ఉంది. దాన్ని చూస్తూ కూచుంటాడతను. వంకీలు తిరిగిన దాని ఆకులవొంకా, వాసనలేని సన్నటి పూలవొంక, చూస్తూ అతను సమాధిస్థితిలోకి వెళ్ళిపోతుంటాడు. అతను రచయిత కావలసిందే! ఎందుకనో కాలేదు.

అతనికి ఈ సమాజంమీద కొన్ని విచిత్రమైన అభిప్రాయాలున్నాయి. సుఖంగా సంసారం చేసుకుంటూ, బ్రతుకులో అడుగడుగునా ఆనందం పందించుకుంటున్న వాళ్ళంటే అతని కిష్టం వుండదు. ఆడవాళ్ళు పిల్లల్ని కనడం, వాళ్ళకి పాలివ్వడం అతనికి చాలా కష్టంగా ఉంటుంది. పెళ్ళిచేసుకోడం అంటే వెధవపనులు చేయడానికి లైసెన్సు పొందడం అని అతను అభిప్రాయ పడతాడు. ఎవరైనా పసందైన ఓ పడుచు స్త్రీ నవ్వుతూ పేలుతూ ఉన్నప్పుడు, అతని ఆలోచన ఇలా సాగుతుంది—

"దీనికి ఒళ్ళు బాగా కొవ్వెక్కిపోయింది. ఏం చూసుకుని ఇదిలా మిడిసి పడుతుందో అర్థంకాదు. అసలు తప్పంతా ఈ వెధవ ముండదికాదు. దీని మొగుడు వెధవ కాబట్టి ఇదిలా ఎగిరెగిరి పడుతోంది. లేకపోతే ఇదెందుకిలా ఒళ్ళంతా ఊపుకుంటూ నవ్వుతుంది! రాత్రిళ్ళుచేసే వెధవ పనులకి వీళ్ళంతా కుళ్ళికుళ్ళి ఏడవాలి.

లై టార్పేసి. ఒకళ్ళ ఒంటిమీద ఒకళ్ళు చేతులు వేసుకుని-పైత్యం కాకపోతే. హాయిగా తిని పడుకోక-ప్రేమట: అను రాగంట: దాని పళ్ళెలా ఉన్నాయి... పైట జారింది కూడా తెలీకుండా ఎలా నవ్వుంతోందో: దీనికి పళ్ళు ఊడిపోతే చావుణ్ణు...."

ఒక్కోసారి అతని ఆలోచనలు అత నికే అయిష్టమైన ఘడియలు కూడా ఉన్నాయి

"వాళ్లేదో ఏడుస్తారు. మధ్య నాకెం దుకు: వాళ్ళు దొర్ళితేనేం-ఏడుస్తేనేం-" అనుకున్నపుడు అతనిమీద అతనికేకోపం వచ్చేది.

అతని దృష్టిలో మనుషులంతా పని చేయాలిగాని ఆనందం అనుభవించ కూడదు. ఆనందం అనేది వ్యక్తిగత విషయం. అది పబ్లిగ్గా అనుభవించడం నేరం. ఆడామగా కలిసి తిరగడం అతని దృష్టిలో ఘోరం, అసలు ప్రకృతిలోనే పురుషునికీ స్త్రీకీ గొప్పతేడా ఉంది. వాళ్ళి ద్దరూ కలిసి తిరుగుతున్నందు వల్లనే ప్రపంచంలో యిన్ని అనర్థాలు ఏర్పడు తున్నాయి. వీళ్లిద్దరి మధ్యా ద్వేషం రగులు కున్నంతకాలం జననా ఉండదు. జనాభా సమస్య ఉండదు. అందికే అతనికి పెళ్ళి నిషిద్ధంగా కనిపిస్తుంది. అతను పుట్టి బుద్ధెరిగి ఏ పెళ్ళికి వెళ్ళలేదు. పెళ్ళి బాజాల కన్న చావుచప్పుళ్లే అతని కిష్టం.

కష్టాలు పడుతున్న వాళ్ళంటే అతను చాలా జాలి చూపిస్తాడు. బాధతో అవ మానంతో ఆకలితో, కటిక దారిద్ర్యంతో, ఒంటరి తనంతో, అంగవిహీనత్వంతో, ఎంతకూ తగ్గని జబ్బుతో అంగలారు స్తున్న జనమే నిజమైన మనుష్యులనీ. వాళ్ళు తనకు చాలా దగ్గర బంధువులనీ అతననుకుంటాడు.

సినిమాలు, నాటకాలు, తాగుడు, జూదం అతనికి నచ్చవు. ఒళ్లు కొవ్వె క్కిన జనం ఏం చేయాలో తెలీక, పెళ్లాం తోనూ మొగుడితోనూ విసిగెత్తి ఇలా పిచ్చెత్తి పోతారని అతను నమ్ముతాడు.

అతనికి ఇరవై య్యేళ్ల వరకూ అతనే వో విధమైన పిచ్చిపిచ్చి ఆలోచనల తోనూ అభిప్రాయాలతోనూ కాలం గడిపే వాడు.

అతనికెందుకో ఆవాళ పార్కుకు వెళ్ళాలనిపించింది. చెట్లంటే అతనికిష్టం. పచ్చగా, అమాయకంగా, దొంగ వినయాలు చూపకుండా, చల్లదనాన్నిస్తూ, పూలూకాయలుగా, మూగగా బతుకుతున్న చెట్లతో అతనెన్నో కబుర్లు చెప్పగలడు.

సాయంకాలపు నీరెండ అతని నీడ మీంచి దూరంగా దూకుతోంది. పక్కనున్న గులాబి మొక్కతో అతను ఏమిటో చెబు తున్నాడు. అతని చుట్టూ జనం లేరు. నీరెండ క్రమంగా అలిసిపోతోంది.

ఓ ముసలాయన కొంచెం దూరంలో నిలబడి అతనివంక చాలాసేపు పరీక్షగా చూశాడు. ఎంతకూ గులాబి చెట్టుతో అతని సంభాషణ పూర్తికాక పొయ్యేసరికి విసిగెత్తినట్టున్నాడు-లేదా-తను వొచ్చిన పని తొందరగా పూర్తి చేసుకోవాలను కున్నాడు. ఒకసారి సకిలించాడు. దగ్గాడు. గట్టిగా శబ్దం చేస్తూ ఆవలించాడు. అయినా గులాబి మొక్కతో అతని సంభాషణ పూర్తికాలేదు. ముసలాయన మూడడుగులు ముందుకు నడిచి "ఏం వోయ్ శాస్త్రీ! బావున్నావా" అని పల కరించాడు.

శాస్త్రి సంభాషణ ఆగిపోయింది. ఉక్కిరి బిక్కిరయ్యాడు. ఎదురుగ్గా ముసలాయనను ఎప్పుడూ తను చూడలేదు. తనేదో సంబరంలో వుండగా ఏదో అన్నాడు. తనిప్పుడు అనవలసిన డైలాగేమిటి?

"ఏవిటోయ్ అలా ఆశ్చర్యపోయి చూస్తున్నావ్? నే నెవర్ననుకుంటున్నావ్?" అంటూ ముసలాయన అతనికి దగ్గరగా కూలబడ్డాడు.

శాస్త్రి కొంచెం యిబ్బందిగా ముఖం పెట్టాడు. కింద గడ్డి పరకని తెంపాడు. దూరంగా విసిరేశాడు. మరో గడ్డి పరకని తెంచాడు. దూరంగా విసిరాడు. మరోటి తెంచాడు. విసిరాడు. మరోటి ............

"నీకో మేనమామ వుండాలి గుర్తుందా?"

"ఏవిటో యిదంతా!?"

శాస్త్రి తల వాల్చుకుని తన పని చేసుకుంటున్నాడు.

అతని చుట్టూ వున్న పచ్చగడ్డి పరకల తలలు తెగిపోతున్నాయి.

ముసలాయన ఒకసారి నవ్వినట్లున్నారు. ఏదో గర్ గర్ లాడినట్టయితే శాస్త్రి తలెత్తి చూశాడు.

ముసలాయన ముఖం కొత్తగా లేదు. రోజూ రోడ్డుమీద ఎంతోమంది ముసలాళ్ళు కనిపిస్తూ వుంటారు. ఈ ముసలాయన ముఖం కూడా అదే మాదిరిగా వుంది. బట్టతల, వున్న వెంట్రుకలు నెరిశాయి. కనుబొమ్మలు గుబురుగా తెల్లగా వున్నాయి. పొడుగాటి ముక్కు కింద మెలి తిప్పిన మీసాల పక్క వెడల్పాటి చెక్కిళ్ళ మధ్య పల్చటి పెదాలూ, అందమైన గడ్డం. ముసలాయన బలం గొప్పదే! తెల్లటి బట్టలు.

"మీ పేరేమిటండీ?" అడిగాడు శాస్త్రి.

ముసలాయన కనుబొమ్మలు కొంచెం కిందికి ఒంగి, సర్దుకున్నాయి. ఆయన చూపులు శాస్త్రి ముఖంమీద ఊగిసలాడాయి. రెండు క్షణాల తర్వాత ఆయన గుబురు మీసాల కింద చిరునవ్వు పుట్టింది.

"నా పేరేవిటని అడుగుతున్నావా




చెబుతాను. చెప్పకపోతే నీకెలా తెలుస్తుంది? నా పేరేకాదు. నీకు చెప్పవలసింది చాలెవుంటుంది. అంత దూరాన్నుంచీ వెదుక్కుంటూ వచ్చిందెందుకు? చెబుతాను గానీ ముందు గదికి పద। కడుపులో యింత పడితేగాని—''

శాస్త్రి పని కొంచెం యిరకాటంలో పడింది. 'ముసలాడు ఘటికుడే' అనుకున్నాడు. అనుకోకుండా వచ్చి, తన తన్మయత్వాన్ని ఆయన తగలెట్టాడని అనిపించినప్పుడు అతనికి ముసలాయన మీద కోపం ముంచుకొచ్చింది.

అసలు ఆయనెవరో తెలియకుండా ఆయన కూడా తనెందుకు వెడతాడు? తనని చూసి ఏమనుకుంటున్నాడో ఏమో।

ముసలాయన చేయందించాడు. లేవకూడదనుకుంటూనే శాస్త్రి లేచి నిలబడ్డాడు. నడవకూడదనుకుంటూనే నడిచాడు. ఎంతో ప్రతిఘటించాలని గుంజీలు పడి. 'ఏదో అరవాలనిపతమతమై పోయి. నోరు విప్పనైనా విప్పకుండా ముసలాడితో అడుగులు కలిపాడు.

ఆనాటి శాకపాకాలు అద్భుతంగా ఉన్నా శాస్త్రికి ఏం రుచించినట్టుగా లేదు. రెండు ముద్దలు అతి కష్టం మీద మింగాడు నాలుగు మెతుకులు అటూ ఇటూ వెదికాడు మజ్జిగ పోసుకుని లేచాడు. ముసలాయన ఇదేం పట్టించుకోలేదు. కుర్చీ మీద బాసింపట్టు వేసుక్కూచుని. అడిగిందే అడుగుతూ, కలిపిందే కలుపుతూ ఆ అవకాశం మరి రాదన్నట్లు. జీవితంలో తినడం తప్ప మరేమంత ముఖ్యమైన వ్యాపకం లేనట్లు. తానుకాక పోయినా శాస్త్రి అయినా డబ్బిస్తున్నందుకు లాభం చేకూరాలన్నట్లు ఎంతో కష్టపడి. అతి ప్రయాస మీద ఆయాందఃపించాడు.

హోటలుకు గదికి అరమైలు దూరం. మధ్యే మార్గంలో ముసలాయన కథ ప్రారంభించాడు. శాస్త్రికి వినక తప్పింది

కాదు.

మునలాయనిది అప్పన పల్లె. శాస్త్రి పుట్టిన ఊరికి ఎంతో దూరంకాదు. ఆయన పేరు పూర్ణయ్య. చెల్లెలు కడుపున పండిన పంట శాస్త్రి. చెల్లెలు కులం కాని వాడి నెవడినో చేసుకుంటుంది. బంధువర్గం తమకు పట్టనట్టు ఊరుకుంటే, పూర్ణయ్య చెల్లెలిని కనిపెట్టుకునుండి తల గొడుగు పోతే తపించిపోయాడు. నెలలప్పుడు సం రక్షణ బాధ్యత స్వీకరించి కన్ను తెరవని తనను ఏం చేయాలో తెలీక, కడకు అనాథాశ్రమానికి తీసుకొచ్చినట్టు మున లాయన చెబుతున్నపుడు శాస్త్రికి ఎవరిమీద ఏవిధమైన కోపం రాలేదు. అతను మాత్రం ఒకసారి తలెత్తి మునలాయన ముఖంలోకి చూశాడు.

"నీకు తెలీదు — నువు నమ్ము... నమ్మకపో; అదినుంచి ఇప్పటి దాకా నిన్ను అన్నివిధాల చూసుకొస్తున్నాను. నువ్వు చదూకోడానికి, ఉద్యోగంలో చేర డానికి మైనడుగారని ఆయనే కారణం. ధర్మాత్ముడు. చచ్చి ఎక్కడున్నాడోగాని, నిరుడు ఆయనకన్ను మూసేవాకా నీ విషయంలో చెప్పలేనంత శ్రద్ధ కన బర్చాడు. పాపం! ఆయనకి మీ అమ్మంటే ఎంతో అభిమానం."

శాస్త్రికి శరీరం చచ్చిపోయినట్టనిపిం చింది. శరీరం చచ్చిపోవడమంటే ఏమిటో అతనికి తెలీదు. పూర్ణయ్య ఆఖరున చెప్పింది విన్నపుడు మాత్రం శాస్త్రి మనసు కష్టపడింది. ఆ అభిమానం ఎటువంటిదని అడుగుదామనిపించింది గాని, అతనికి నోరు పెగల్లేదు.

"ఏమైనా-నువ్వదృష్టవంతుడివోయ్!" అన్నాడు పూర్ణయ్య.

తను అదృష్టవంతుడు!

ఏ విషయంలో??

తండ్రి ముఖం, కన్నతల్లి అనురాగం తనెరగడు. నా అన్న వాళ్ళెవరూ లేకుండా తనిన్నాళ్ళూ బతికాడు. ఎవరో డబ్బు పంపించారు. తను చదువుకున్నాడు. ఎట్లానో ఉద్యోగంలో చేరాడు. ఇంత వరకూ తను ఎవరి ఆదరాన్నీ పొందలేక పోయాడు. అట్లాంటి తను అదృష్ట వంతుడు.

అతనికోసారి పగలబడి నవ్వాలని పించింది. అవెనకనే జుత్తు పీక్కుంటూ, ఎడారిలాంటి ఇసకలో కూలబడిపోయి, ఆకాశంవంక చూస్తూ ఏడవాలనిపించింది. అయినా, అతనేం చేయలేదు. నింగినీ, నేలనూ, ప్రక్కనే నడుస్తున్న మనిషినీ చూశాడు.

గది తాళం తీశాడు, స్విచ్ వేశాడు. లైటు వెలుగులో గదినీ, గదిలోని సామగ్రిని పరీక్షగా చూశాడు పూర్ణయ్య.

"ఈ గదిలోనా నువుండేది?" అని అడిగాడు పూర్ణయ్య.

ఆ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో శాస్త్రికి అర్థంకాలేదు. మిడుతూ మిడుతూ చూశాడు. ఊరికే తలూపాడు.

గదిలో పెద్ద సామగ్రి లేదు. కిటికీలో అద్దం, షేవింగ్ బ్రష్, రేజర్, వాడేసిన బ్లేడులు, విరిగిన పెన్సిలొకటి, రెండు బస్ టికట్లు ఉన్నాయి. ఆ గదిలో అలమారాలేదు. గదికి ఓ మూల ఒక చెంబూ గ్లాసూ వున్నాయి. పక్కనే తుంగ చాపుంది. అందులో పక్క దుప్పట్లున్నాయి. తుంగ చాప

లోంచి మాసిన దుప్పటి అంచుమాత్రం బయటికి వేలాడుతూ వెక్కిరిస్తోంది. మరో మూల ఏవో నాలుగైదు పుస్తకాలు పడివున్నాయి. ఒక పక్క ఆ మూలనించి ఈ మూలకి కట్టిన తాడుమీద వేలాడుతున్న మాసిన బట్టలు ముక్కు కంపుగొడుతున్నాయి. గది తుడిచి ఎన్నాళ్ళయిందో తెలీదు. ఆకులూ, కాగితం, ముక్కలూ దుమ్మూ ధూళీ గదినిండా పరుచుకున్నాయి.

శాస్త్రి తుంగచాప పరిచి, గుమ్మానికి దగ్గరగా లాగి దుప్పటి పరిచాడు.

"మీ రిక్కడ పడుకోండి." అన్నాడు

"మరి నువ్వో?" అన్నాడు పూర్ణయ్య.

"బయట అరుగుమీద పడుకుంటాను" నదుం వాల్చాడు పూర్ణయ్య

"నిన్న తీసుకువెళదామని వొచ్చాను. నిన్ను చూస్తే మీ అమ్మని చూసినట్టుంది. అది బతికుంటే ఎంత సంతోషించేదో! రేపు దరఖాస్తు రాసిచ్చి శెలవు శాంక్షన్ చేయించుకో. పది రోజులుండి వొచ్చేద్దూగాని."

శాస్త్రి అవుననిగాని కాదనిగాని ఏం చెప్పలేదు. దుప్పటి తలగడా పుచ్చుకుని లైటార్పి బయటరుగుమీదికి వొచ్చాడు.

చెట్టు కిందజేరి, ఆలోచనల్లో మునిగిపోయాడు. ఆ చల్లని రాత్రివేళ హాయిగా గాలి వీస్తున్నప్పుడు. ఎంతకూ చిక్కబట్టుకోలేని గుండెల్లో, విలన్‌లాగా దాపరించిన పూర్ణయ్య ఏదో గారడీచేసి ఒక దారిలో నడిచిపోతున్న జీవితాన్ని తలకిందులు చేసేసి బరువునీ బాధ్యతనీ తనమీదికి తోసేసి, తన్నెందుకూ కొరగానివాణ్ణి చేస్తాడేమోనన్న భయంతో ఉక్కిరిబిక్కిరౌతున్నాడు.

ఎప్పుడో నిద్రపట్టింది. మెలకువ వచ్చేసరికి తన చుట్టూ వెలుగు వ్యాపి

స్తోంది. పక్కమీద అశోకవృక్షం ఆకులు రాలి పడుతున్నాయి. నూతి దగ్గర అంట్లు తోముతున్న చప్పుడు విని పిస్తోంది. పక్కింటి నాయుడుగారి కోడి అప్పుడే లేచినట్లుంది 'కొక్కొరోకో' అని అరిచింది. బద్ధకంగా కళ్ళు మూతలు పడబోతున్నాయి. చటుక్కున అతనికి పూర్ణయ్య తన గదిలో పడుకున్న విషయము గుర్తొచ్చింది. ఎక్కడ బద్ధకం అక్కడికి రెక్కలు కట్టుకు పారిపోయింది. లేచి కూచున్నాడు. గదిలోకి చూశాడు గదిలో పూర్ణయ్య లేడు. శాస్త్రి గుండె ఝల్లుమంది. అంతకు రెండు రోజులకు ముందే తను జీతం అందుకున్నాడు. కడకు జరిగిందదన్నమాట!!

"ఏంవోయ్ లేవావా?" అంటూ పలకరించాడు పూర్ణయ్య - అరుగుమీద తన పక్కన కూచుంటూ శాస్త్రి తలెత్తలేకపోయాడు

"రాత్రి నేను చెప్పింది జ్ఞాపకం వుంది కదూ! రేపు మనం బయలుదేరుతున్నాం. ఇవాళ శలవు శాంక్షన్ చేయించుకో."

"ఏమిటది! ఈయన తనను వదిలేట్టు లేడు. తన పాలిటి కీయన మిలిటరీ ఆఫీసరులాగున్నాడు. ఏమైనా సరే తను శలవు పెట్టడు ఎంత బలవంత పెట్టినా తను పాళర్లపూడి ముఖం చూడడు అంతే!

అవాళ ఆఫీసుకు చేరుకోడం కొంచెం ఆలశ్యమైంది దానికితోడు పనెక్కువగా ఉంది. కాగితాలతో యుద్ధంచేస్తూ కాలాన్ని మరిచిపోయాడు శాస్త్రి.

ఒంటిగంటదాటాక కాబోలు. తన కుర్చీపక్క ఎవరో నిలబడి ఉండడంచూచి తలెత్తాడు. ఎవరోకాదు—పూర్ణయ్య.

"మీ అసిస్టెంటు సెక్రటరీతో మాట్లాడాను. పదిరోజులు శలవిస్తానన్నారు. ఇదిగో—అప్లికేషన్ టైప్‌చేయించాను. సంతకంపెట్టు" అన్నాడు పూర్ణయ్య.

శాస్త్రికి ఏమనాలో తెలీలేదు. కసిగా కాగితాన్ని అందుకుని, బరబరగీకి. పూర్ణయ్యమీదికి విసిరేశాడు.

సంతకం చేసింతరువాత శాస్త్రి తనను తను తిట్టుకున్నాడు. తన అసమర్థతని తిట్టుకున్నాడు.

"వీడు నన్ను బతకనిచ్చేట్టులేడు ఊరికి తీసికెళ్ళి వీడేదో చేస్తాడు. అక్కడ నా పీక పిసికితే నేనేం చేయను! ఓరి భగవంతుడా! ఈ ఆపద తప్పించవా? నువ్వు కాకపోతే మరెవ్వరు తప్పిస్తారు? నువ్వు నన్ను పరీక్షిస్తున్నావు. నేనేం చేయాలి?"

ఆ తరువాత అతను కుర్చీకి జారగిలబడిపోయి గొణుక్కోవడం ప్రారంభించాడు.

ఆఖరు నిమిషం వరకూ అతను పూర్ణయ్యకూడా వెళ్ళకుండా ఉందామని పోరాడేడు. ఏదో కుంటిసాకు చెబుదామనుకునేవాడు.

కానీ, నోరెత్తడానికి భయపడేవాడు ఆ మర్నాడు అతనెక్కడికైనా పారిపోదామనికూడా అనుకున్నాడు. చివరికి ఉదయం ఎనిమిదిగంటలకి వాళ్ళిద్దరినీ తీసుకుని బస్సు బయలుదేరింది.

నరసాపురం రేవుదాటి, తిరిగి మరో బస్సెక్కి పాళర్లపూడి చేరుకునేవేళకు సాయంకాలం దాటింది. వాళ్ళిద్దరూ రెండెడ్లబండిమీద పూర్ణయ్య స్వగ్రామా

నికి బయలుదేరారు.

శాస్త్రికి ఒంటిమీద స్పృహలేదు. ఏదో గొప్ప ప్రమాదం జరగబోతోందని విని మూర్ఛపోయిన వాడిలాగా ఉన్నాడ తను. అతనిలో ఓమూల అనుమానం ఒకటి మొలకెత్తి క్షణక్షణానికీ పెద్దదైగి పోతోంది.

గుమ్మంలో బండి ఆగి ఆగగానే గుమ్మటంలాఉన్న ఒకావిడ ఎగిరెగిరి పడుతూవచ్చింది.

"వచ్చావటయ్యా! బుద్ధిమంతుడివి. ఎప్పుడో పసిబిడ్డగా చూశాన్నిన్ను! మళ్ళీ ఇన్నాళ్ళకి ..." అంటూ ఆవిడ పనస ప్రారంభించింది.

పూర్ణయ్యే నోరింత చేసుకుని అరవడం లంకించుకున్నాడు—" అందంతా సరేలేవే ముందల్లుడ్ని దిగనీ....దిగనిస్తావా లేదా!"

ఆవిడ అల్లుడి చేయందుకుని "జాగ్రత్తగా దిగుబాయనా!" అంది.

శాస్త్రి ఒంటిమీద తేళ్ళు. జెర్రులూ ప్రాకినట్టయింది. ఆడదాని స్పర్శ ఎరుగని వాడతను. ఆమె వయస్సు దాదాపునలభై ఏళ్ళుండవొచ్చు. అయినా పాతికేళ్ళదానిలా వుంది. పచ్చగా, బొద్దుగా చక్రాలంత కళ్ళతో, చిరునవ్వుతో ఒక స్త్రీ తను భూమ్మీద దిగడానికి చేయందివ్వనప్పుడు శాస్త్రి శరీరం గజగజ వణికింది.

"ఎంత మోసమైతే మాత్రం....ఛీ!" అనుకుని, చేయి విడిపించుకోబోయాడు. ఆవిడ వొదల్లేదు. అతన్ని మెల్లగా మెట్లమీదికి నడిపించుకు వెళ్ళి, కాళ్ళుకడుక్కోడానికి, దాహానికి నీళ్ళిచ్చింది.

"రాజ్యం: అలా నడవాలో కుర్చీవాల్చు. అబ్బాయి కాస్సేపు కూర్చుంటాడు" అనిపురమాయించాడు పూర్ణయ్య.

వాలుకుర్చీలో నడుం చేర్చాడు శాస్త్రి.

సాయంకాలపు నీరెండ క్రమంగా విరిగి పోతోంది. అతనికి అశోక వృక్షం గుర్తొచ్చింది. అయ్యరు గుర్తుకొచ్చారు. అన్నిటినీమించి-అత్తయ్య స్పర్శ గుర్తొచ్చింది తలెత్తి చూస్తే ఆవిడ పక్కనే నిలబడుంది, భుజంమీద చెయ్యేసి. కళ్ళలోకి చూస్తోంది.

"లేబాబూ! స్నానం చేదూగాని" అంటూ భుజాలు పట్టిలేవ దీసింది.

ఆ మరునాటి మధ్యాహ్నం కంది పచ్చడి, మెంతి పులుసుతో భోజనం కొంచెం బరువైంది. దాంతో శాస్త్రికి అద్భుతమైన నిద్ర పట్టింది. మెలకువొచ్చే సరికి, ఎవరిదో ఒక గంభీర కంఠస్వరం తనకతి సామీప్యంగా వినిపిస్తోంది.

"బేషుగ్గా ఉంది. రేపు రాత్రి 12గంటల 48నిమిషాలకు వృషభలగ్న ముహూర్తం. మరి పదిహేను రోజులవరకూ ముహూర్తాలు లేనేలేవు. శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు."

శాస్త్రి గుండెల్లో రాయి పడింది. ఏవిటిది! రేపు రాత్రి 12 గం॥ 48 ని॥లకు ముహూర్తం. అతనికి తల దిమ్మెక్కిపోయింది. రెండు తుమ్ములు తుమ్మాడు.

"అల్లుడు లేచినట్టున్నాడు రెండు తుమ్ములు శుభాన్ని సూచిస్తున్నాయి. మరినే వెళ్ళొస్తాను పూర్ణం!"

పూర్ణయ్య లోపలకొచ్చాడు. ఆయన్ని చూస్తే భయం వేసింది. శాస్త్రికి."

"లేచావుటోయ్ - లే-లేచి ముఖం కడుక్కో! ఇప్పుడే పురోహితుడొచ్చాడు.


PLATFORM
2

ముహూర్తం నిర్ణయం కూడా అ యింది. రేపు రాత్రికి జేషగ్గా ఉందంటు న్నాడాయన. ఏదో—ఇది అయిందని పిస్తే నా బరువు తీరి పోతుంది....''

అసలు జరుగుతున్న దేమిటో శాస్త్రికి అంతు పట్టలేదు. నిలువు గుడ్లేసి చూస్తూ కూర్చుండి పోయాడు.

''ఒక్కగా నొక్క పిల్ల. ఇంకనా కెవ్వరున్నారు? స్వార్జితంపదిహేనెకరాలూ, ఈ కొంపా మీవే. మేం బతికి నన్నాళ్ళూ ఇంత తింటాం. ఆతరువాత మీ యిష్టం...''

శాస్త్రికి గుక్క తిరగలేదు. అన హ్యంతో అతని మనసు నిండి పోయింది. తను భయపడినంతా అయింది. తనకు పెళ్లి!! పిల్ల ఎలా గుంటే తనకేమి? ముహూర్తం మాత్రం నిర్ణయమై పో యింది. తనసలు పెళ్లి చేసుకో దలచుకో లేదు. పెళ్లి చేసుకున్న మగాళ్లంతా ఎలా బతుకుతున్నారో తనకు తెలుసు. తెలిసి తెలిసీ తనీ సముద్రంలో దూకలేదు. పెళ్లి చేసుకున్న మగాళ్ళంతా పురుగుల్లాగా దోమల్లాగా, బానిసల్లాగా సిగ్గు ఎగ్గు విడి చేసి బతుకు తున్నారు. వాళ్ళకి పౌరుషం లేదు. పెళ్ళాం నవ్వితే చాలు వాళ్లు తమని తాము మరిచి పోతారు. మంచీ చెడ్డా. పగలూ రాత్రీ. చూడరు. తను వాళ్ళ మాదిరిగా బతకక లేదు. తనకి స్వతంత్రం కావాలి. ఒకరి జోలీ శొంఠి, తనకక్క ర్లేదు. ఆకలేస్తే తింటాడు. నిద్రొస్తే పడు కుంటాడు. కాని—పెళ్ళయితే ఏమౌ తుంది? స్వతంత్రం ఉండదు. ఇష్టా యిష్టా లుండవు.

తను పెళ్ళి చేసుకోకూడదు.

పెళ్ళి చేసుకొని తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకూడదు.

పెళ్ళి చేసుకొని తనూ సిగ్గూ ఎగ్గూ విడిచి పెట్టకూడదు.

అయితే ఏం చేయాలి?

ఏర్పాట్లన్నీ జరిగాయి. నిమిషాల్లో కొబ్బరాకుల పందిరి వేశారు. రాటలకు పచ్చి కొబ్బరాకులు చుట్టారు. మామిడాకు తోరణాలు కట్టారు. ఊరందరికీ భోజ నాలు చెప్పారు. ఆ మరునాడు ఉదయం నించీ ఏవేవో సినిమా పాటలతో వీధి వీధంతా హోరెత్తిపోయింది. ఆయన వాళ్ళూ, అప్పుడూ పిండి వంటలతో భోజ నాలు చేశారు.

శాస్త్రి మనసు తుక తుక ఉడికి పోయింది. విషం దొరికితే బావుండను కున్నాడు. గట్టిగా గొంతెత్తి నలుగురి లోనూ అల్లరి చేదామనుకున్నాడు. అందరూ తనను అతి గౌరవంగా పల కరించి, బాగోగులు చూట్లాడుతున్నపుడు అతను పిచ్చి పిచ్చి వేషాలు వేయలేక పోయాడు.

ముహూర్తం వేళకు శాస్త్రి పెళ్ళికూతురు మెళ్ళో మూడు ముళ్లూ వేయకతప్పలేదు.

బాజాలు మోగాయి.

పెళ్ళికూతురు అతి హుషారుగా తలం బ్రాలు పోసింది.

గృహప్రవేశ సమయానికిగాని అతనికి మరదలి పేరు తెలీలేదు.

''కామాక్షీ నేనూ వొచ్చాం.'' అని శాస్త్రి ఎంతో బాధగా, అసహ్యంగా, మెల్లగా, సిగ్గుపడిపోతూ చెప్పినపుడు అమ్మలక్కలు కిసుక్కున నవ్వారు.

మర్నాడు సత్యనారాయణ వ్రతం.

ఆ తరువాత రెండులోజులకు రాత్రి

పది దాటిన తరువాత, శాస్త్రి పూలపరిమళం అలముకున్న శోభనం గదిలో తెల్లటి దుప్పటిమీద. తెల్లటి దుస్తులతో అసహ్యంగా అటు తిరిగి పడుకున్నాడు.

తలుపు గడియ పడింది.

కామాక్షి చాలాసేపు తలుపు దగ్గరే నిలబడింది.

ఒకసారి శాస్త్రి తలెత్తి చూచాడు.

అతనికి కామాక్షిమీద బోలెడంత కోపం వొచ్చింది పళ్ళు పట పట కొరికాడు. ఆ పిల్ల చాలాసేపు నిలబడి మెల్లగా మంచం దగ్గర కొచ్చింది.

ఎంతకూ శాస్త్రి పలకరించకపోయే సరికి ఏం చేయాలో తోచిందికాదు.

మెల్లగా తన చేతిని అతని భుజంమీద వేసింది.

శాస్త్రికి ఎక్కడలేని కంపరం పుట్టుకొచ్చింది. ఆ చేతిని విసిరికొట్టాడు.

"అదేమిటి బావా! ఎంత కోపమైతే మటుకు అలా ముడుచుకు పడుకుంటే — తలుపు సందుల్లోంచి చూస్తున్న వాళ్ళేమను కుంటారు?" అనడిగింది కామాక్షి.

అయినా శాస్త్రి గోడ వైపే చూస్తూ పడుకున్నాడు

"పాలు తాగుబావా!" అంది కామాక్షి.

అయినా అతను కిమ్మన లేదు.

మంచం మీద కూచుని, అతన్ని తన వైపు తిప్పుకోబోయింది. అతను చటుక్కున లేచి కూచున్నాడు.

"ఇదిగో పిల్లా! ఇవేం నాకు నచ్చవ్, ఇలా చేయడం నాకసహ్యం. నాకసలు పెళ్ళంటే రోత. అయినా మీరంతా కలిసి నన్ను ఎందుకూ పనికిరాని వాణ్ణి చేశారు మవ్వు ఈ ప్రేమా గీమా నటించకు. ఒళ్ళు తీవరం కాక పోతే ఈ వెధవ్వేషాలేమిటి? ఆ పాలేవో తాగి మెదల కుండా పడుకో" అనేసి గోడ వైపు ముఖం పెట్టుకు పడుకున్నాడు శాస్త్రి.

కామాక్షి బిక్కచచ్చి పోయింది. మరేం మాట్లాడలేదు. ఆ పిల్ల శరీరంలోని పరువపుదనం వేడంతా క్షణాల్లో దిగి పోయింది

మెదల కుండా పడుకుంది.

ఓ రాత్రి వేళ శాస్త్రికేదో పీడకల వొచ్చి నట్టుంది—"వొద్దు...నాకొద్దు— నాకసహ్యం ... పో - - దూ రం గా పో - -" అంటూ గట్టిగా అరుస్తూ లేచి కూచున్నాడు.

కామాక్షి అదిరి పడి లేచింది.

"ఏమండి—ఏమైంది?" అనడిగింది

సన్నటి కిరసనాయిలు దీపం వెలుగులో శాస్త్రి ఆ పిల్ల ముఖంలోకి చూశాడు.

నిద్రతో మత్తిల్లిన కళ్ళు, నున్నటి చెక్కిళ్ళు, అందమైన ఎర్రటి పెదాలు. పమిట జారి బయట పడ్డ వక్షం మీద ఎదిగిన ఎత్తులు—అమాయకత్వం. అందం శాస్త్రి మనస్సును ఒక్క క్షణం ఊపి వేశాయి. అతను నిగ్రహించుకోలేక పోయాడు. మనసు తుఫాను నాటి సముద్రమై పోయింది. రెండు చేతులూ చాచి, ఒక్కసారిగా కామాక్షిని గాఢంగా కావలించుకొని మెల్లగా మెత్తగా "కామూ!" అని పిలుద్దామనిపించింది. మరుక్షణం లోనే అతను మామూలు శాస్త్రయి పోయాడు.

కొంచెం తడబాటు కలిగింది

ఏం మాట్లాడ కుండానే, అటు తిరిగి

పడుకున్నాడు.

కామాక్షి ఎన్నో కథలు చదివింది. ఎన్నో కలలు కంది. తొలిరాత్రి మాధుర్యాన్ని చవి చూచిన ఆమె స్నేహితురాళ్లు చెప్పిన కమ్మని కథలు వింది. తన వరకూ వొచ్చే సరికి తల కిందైన తన కలల్ని తలచుకుని, ఆమె ఒక నిట్టూర్పు విడిచింది.

తెల్లవారు ఝామున అతనికి మళ్ళీ మెలకువ వచ్చింది. కామాక్షి చేయి అతని కంఠాన్ని అప్యాయంగా కౌగలించుకునుంది. అతను తాచుపామును చూసినట్లు దడుసు కున్నాడు. మెల్లగా ఆ పిల్ల చేతిని తప్పించి, తలగడ మీదమోపి, తలుపు తెరచుకుని బయటికి వొచ్చాడు.

కామాక్షి స్పర్శ అతనికి బాగానే వున్నట్టున్నా, లోపల గూడుకట్టుకున్న అసహ్యంవల్ల, ఆడవాళ్ళంటే అతనికి ఏర్పడ్డ జుగుప్సవల్ల అతను తనలో కలిగిన కోరిక గొంతు నొక్కేశాడు.

బయటగాలి చల్లగా వుంది. పడిమీద గోడకు మెల్లగా జారగిలబడ్డాడు. మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు.

అప్పుడే లేచిన అత్తగారు అతణ్ణి చూసింది. పూర్ణయ్యా చూశాడు వాళ్ళిద్దరూ జరిగిందేమిటో తెలీక కొంచెం తికమక పడ్డారు.

కామాక్షికి మెలకువొచ్చాక అతను కనిపించలేదు. కంగారు పడింది. కళ్ళు నులుముకుంటూ బయటికొస్తున్న కూతురిని చూసింది రాజ్యలక్ష్మి.

తల్లి కనిపించగానే సిగ్గు పడింది.

''ఏమే మీ ఆయన బయట పడుకున్నాడేమిటే?'' అనడిగింది రాజ్యలక్ష్మి.

కామాక్షి కేం చెప్పాలో తోచలేదు.

''రాత్రంతా ఉక్కపోస్తోందని గోల పెట్టారు. పాపం! తెల్లవారు ఝామున బయటికొచ్చి పడుకొన్నట్టున్నారు....'' అంది.

రాజ్యలక్ష్మి కూతురును దగ్గరకు తీసుకుని, మెత్తగా ఆపిల్ల బుగ్గ మీద ముద్దు పెట్టింది. కామాక్షి సిగ్గు పడిపోతూ, మెల్లగా కౌగిలి తప్పించుకుంది.

ఆవేళకు శాస్త్రికి మెలకువ వొచ్చేసింది. చల్లగా స్నానం చేశాడు. ఉప్మాలో జీడి పప్పొకటి ఏరుకుని, పళ్ళమధ్య నూరికించి, ఆలోచనలో మునిగాడు శాస్త్రి. ఎదురుగ్గా కూర్చున్న పూర్ణయ్య ముఖాన్ని ఓసారి చూసి,'' ఇవాళ మధ్యాహ్నం బయలు దేరుతాను'' అన్నాడతను.

పూర్ణయ్య ఆశ్చర్యంగా చూశాడు.

ఇంకా నాలుగు రోజులు శలవుంది గదటోయ్'' అన్నాడాయన.

''శలవకేమిటి! రేపెప్పుడైనా అవసరమైతే కష్టం. వెళ్ళి కాన్సెల్ చేసుకుంటే, మళ్ళీ అవసరమైనపుడు పెట్టుకోడానికి వీలౌతుంది''

పూర్ణయ్యకేం చెప్పడానికి తోచ లేదు. లోపలకెళ్ళి భార్యనీ, కూతుర్నీ విడివిడిగా సంప్రదించాడు వార్త విన్న వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు-ముఖ్యంగా కామాక్షి.

ఏమైతేనేం, అపూట భోజనం చేసి శాస్త్రి బయలు దేరాడు.

రాత్రి పదిగంటల వేళ అతను తన గది చేరుకుని ముఖం చేతులూ కడుక్కొని, కిటికీలోంచి అచీకట్లో ఏమీ ఎరగనట్లు, నిలబడ్డ అశోక వృక్షం వంక జాలిగా

దీనంగా చూస్తూ జరిగి పోయిన ఘోర ప్రమాదాన్ని తలంచుకుంటో కూర్చుండి పోయాడు. జరిగిదంతా అతనికి ఒక కలలాగా ఉంది. కలైతే బావుండిపోను. కలకాదు. వేలికి బంగారం బటువు స్పష్టంగా. వెన్నెల వెలుగులో మెరుస్తూ కనిపిస్తోంది. ఇది నిజంకాక పోవడమేమిటి! నిజమే! అక్షరాలా నిజం: తనకు పెళ్ళయింది. తను కామాక్షి మెడలో మూడు ముళ్ళు వేశాడు. ఈవిధంగా తను పతనమై పొయ్యాడు. ఇంతే! ఈ బ్రతుకింతే!

అతని కళ్ళలో నీళ్లు తిరిగాయి. కిటికీ అంచు మీద తల పెట్టి. అతను ఊచల నందు నుంచి దీనంగా బయటికి చూశాడు.

తను వొచ్చే ముందు కామాక్షి తనతో ఏదో చెప్పాలని తాపత్రయ పడింది. అందుకు తను అవకాశ మివ్వ లేదు. ఆపిల్ల ఏమని చెప్పి ఉండేదో: రెండెడ్ల బండెక్కుతున్నపుడు గదిలో కిటికీలోంచి కన్నీరోదు తున్న కళ్ళతో ఆపిల్ల కనిపించడం అతనికి జ్ఞాపకం వొచ్చింది.

అప్పుడతనికి ఏం అని పించలేదు.

ఇప్పుడు మాత్రం మనసు చెమ్మగిల్లింది.

పాపం! ఆ పిల్ల ఏం తప్పు చేసింది? అందరిలాగా ఆ పిల్ల పెళ్లి చేసుకుంది. కాని— తనెందుకు చేసుకోవాలి!!?

తాను దౌర్భాగ్యుడు. తనకు సుఖం లేదనేది స్పష్టం తన వల్ల మరెవ్వరికీ సుఖం లేదు. తాను దురదృష్ట వంతుడు కనుకనే అమ్మా నాన్నా చచ్చి పోయారు. తన దురదృష్టం కామాక్షికి కూడా పట్టుకోవాలా? కామాక్షి దురదృష్ట వంతురాలు కాక పోతే తానెందుకు కామాక్షిని చేసుకుంటాడు!

శాస్త్రికి చాలా జాలి వేసింది. తన మీద తనకే జాలి వేసింది. కొంచెం కోపం కూడా వచ్చింది. అరచేత్తో నుదుట మీద నాలుగు సార్లు మోదుకున్నాడు.

ఆఫీసులో జనానికి శాస్త్రిమీద అనుమానం వచ్చింది. వారం రోజుల్లోనే శాస్త్రి బుగ్గలు కొంచెం నునుపెక్కాయి. ఎప్పుడూ హోటలు తిండికే అలవాటు పడి పోయిన అతని నాలిక కోనసీమ తిండికి పులకరించింది. ఆ విధంగా అతను అక్కడున్నన్ని రోజులూ రెట్టింపు తిండి తిన్నాడు. అదంతా రక్తమై అతనిలో కొత్త ఉత్సాహాన్ని పుట్టించింది.

పెళ్లాన్ని తలచు కున్నపుడు శాస్త్రికి కొంచెం గర్వం కూడా కలుగుతూ వచ్చింది. తన పెళ్లాం బంగారు బొమ్మ. నూటికి పదిమందిలో మాత్రం అందం కనిపిస్తుంది. చక్రాల్లాంటి కళ్ళు. సన్నటి ముక్కు, అందమైన పెదాలు— ఇవి జ్ఞాపకం వచ్చి నపుడు వెంటనే అతనికి శోభనం నాటి తెల్లవారు ఝామున కామాక్షి తన కంఠం పైన చేయేసుకు పడుకోవటం గుర్తొచ్చి. అతను పులకించి పోయేవాడు. ఆవెను వెంటనే తనిలా క్రమంగా కామాక్షి వైపు ఆకర్షిత వవుతున్నాడని గ్రహించి సిగ్గు పడేవాడు. కోపంతో తల బాదుకునే వాడు.

ఆ రోజు అయ్యరు కంది పచ్చడి చేశాడు అద్భుతంగా ఉంది. ముద్దమీద ముద్ద తింటున్నాడు. ఎప్పుడూ లేనిది తింటూ తింటూ! సర్వర్‌తో వేళాకోళం ఆడేడు.

వాడు ఆశ్చర్య పోయి చూశాడు.

ఎప్పుడూ నోరెత్తని వాడు ఇలా మారి పోయాడేమిటా అని వాడికి గొప్ప ఆశ్చర్యం కలిగిచటంలో తప్పు లేదు.

శాస్త్రికి వెంటనే అప్పన పల్లి గుర్తొచ్చింది. అత్తారింట్లో కంది పచ్చడి గుర్తొచ్చింది. ఆవెను వెంటనే కామాక్షి కళ్ళ ముందు కదలింది'

తను బండెక్కేటప్పుడు కిటికీ లోంచి కన్నీళ్ళరు తున్న కళ్ళతో జాలిగా దీనంగా చూస్తున్న కామాక్షి తలపుకు రాగానే అతనికి తనమీద తనకే కోపం వచ్చింది.

తను నిజంగా మూర్ఖుడు. ఒక అమాయకురాలి మనస్సుకి బాధ పెట్టే అర్హత తనకు లేదు. బంగారు బొమ్మలాంటి భార్యని పువ్వుల్లో పెట్టి పూజించుకో వలసింది పోయి, ఒట్టి పల్లెటూరి గబ్బిలాయలాగా, చదువురాని మూర్ఖుడిలాగ మనసు విప్పి మాట్లాడ్డం చేతగాక, తొలిరాత్రి ఆదరంగా అభిమానంగా ఆత్మీయ ప్రేమతో చేయిబోతే కౌగిట్లోకి తీసుకోడానికి మనసు లేక తనెంత గొప్ప తప్పిదం చేశాడో తెలిసి అతను ఎంగిలి చేత్తో తల బాదు కున్నాడు. అది చూసిన సర్వర్‌కి మరీ మతిపోయింది. తను చేసిందేమిటో తెలుసుకుని, శాస్త్రి క్షణం బిత్తరపోయి గబ గబా చేయి కడుక్కోడానికి లేచి వెళ్ళాడు.

రోజులు గడుస్తున్నాయి. తెల్లవారగానే ఆఫీసు గుర్తొస్తుంది, చీకటి పడగానే అతనికి కామాక్షి గుర్తొస్తుంది. మామగారు ఎన్ని ఉత్తరాలు రాసినా శాస్త్రి సమాధానం రాయలేదు. రాద్దామని కూడనే వేళకు రేపు రాద్దాములే అనిపించేది. అయినా. ఏం రాస్తాములే అనిపించేది. "నేను రాలేకపోతే మటుకు ఏమౌతుందిలే అని కూడా అతననుకునే వాడు.

ఉత్తరాలు రాయటం అంది పుచ్చుకోవటంలోని అందచందాలు అందరికీ తెలీవు మరి!

ఒక రోజు రాత్రి అతను కిటికీ దగ్గర కూచుని చెట్టు వంక చూస్తో ఆలోచిందు కుంటున్నపుడు తలుపు తోసిన ట్టని పించింది. గాలి కాబోలను కున్నాడు. ఎవరిదో అడుగుల చప్పుడైంది. అయినా ఎవరొస్తారులే అనుకున్నాడు.

"ఏమయ్యా; ఎన్నుత్తరాలు రాసినా జవాబే లేదు"

శాస్త్రి గుండె గతుక్కు మంది. చటుక్కున లేచి నుంచున్నాడు.

"ఇదేనా రావటం" అనడిగాడు శాస్త్రి.

"రావటం మధ్యాహ్నమే వచ్చాం. ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పు" అని మొరాయించాడు పూర్ణయ్య.

శాస్త్రి మెల్ల మెల్ల మెల్లగా టూ— "ఒంట్లో బావుండక ... ..." సీళ్ళు నమిలేశాడు.

"ఒంట్లో బావుండక పోతే — ఓ కార్డు ముక్క రాయడానికేం — అన్నాయని పంపించే వాణ్ణిగా!"

శాస్త్రికి గొప్ప అనుమానం వచ్చింది 'రావటం మధ్యాహ్నమే వచ్చాం' అన్నాడు పూర్ణయ్య. అంటే ఊరి నుంచి నలుగురైదుగురు స్నేహితులు వచ్చుండాలి. తను పెళ్ళయిన వెంటనే మాటా మంతీ లేకుండా పారిపోయినట్టు వొచ్చేసి ఆ తరువాత ఉత్తరం పత్తరం లేకుండా

మౌనం వహిస్తే ఇప్పుడీ పెద్దలంతా పంచాయతీ చేసి నాకు తగిన శిక్ష వేస్తారు కాబోలు. హారి భగవంతుడా! నేను దొరికి పోయాను. ఇంక వీళ్ళు నన్ను గోతిలో దింపేస్తారు. సముద్రంలోకి విసిరేస్తారు. కామాక్షి నిజం చెప్పేసుంటుంది. అదంటే సుతరామూ నా కిష్టం లేదని నమ్మి వీళ్ళంతా నా మీదకి దండయాత్ర చేశారు అనుకున్నాడు శాస్త్రి.

"గదికి తాళం వేసి పద" అన్నాడు పూర్ణయ్య.

గదికి తాళం వేస్తున్నపుడు శాస్త్రి చేతులు వొణికాయి.

"నేను మళ్లీ కులాసాగా తిరిగి రాగలనా?" అనుకుని ఏడుపు ముఖం పెట్టాడు.

రిక్షా మీద యిద్దరూ శాస్త్రి వాళ్ళ ఆఫీసుకు దగ్గర ఓ యింటి దగ్గర దిగారు.

గుమ్మంలో ఒకావిడ భుజాల మీద కొంగు కప్పుకొని నిలబడుంది. శాస్త్రిని చూడగానే లోపలికి వెళ్ళి పోయింది.

ఆ యిల్లెవరిదో శాస్త్రికి అర్థం కాలేదు. ప్రశ్నార్థకంగా పూర్ణయ్యని చూసేడు.

"నడవ్వయ్యా-లోపలికి నడు" అన్నాడు గాని పూర్ణయ్య లోపలకి రాలేదు.

శాస్త్రి బితుకు బితుకుమంటూ లోపలికొచ్చాడు. అక్కడ గది గుమ్మం దగ్గర లైటు వెలుగులో కామాక్షి కన్పించింది. శాస్త్రి ముఖం ఒక్కసారి ఆనందంతో వెలిగింది. కామాక్షి! అవును. తన పెళ్లామే అడుగు ముందుకు వేయబోయి ఆగి పోయాడు

కామాక్షి ఎందుకు వచ్చినట్టు?

తనని వీళ్ళంతా సముద్రంలోకి తోసేస్తారు. తాను మునిగిపోతాడు.

కామాక్షే తండ్రి కీ ప్లాను చెప్పి వుంటుంది.

గదిలో యిద్దరూ కూచున్నారు.

"మధ్యాహ్నమే వచ్చాం మేం. ఈ గది వసారా అద్దెకు మాట్లాడారు నాన్నగారు. మీ రా గది ఖాళీచేసి రేప్పొద్దుట సామానంతా తెచ్చేయండి" అంది కామాక్షి.

గది తలుపులు దగ్గరగా వేసి మెల్లగా శాస్త్రి పక్కజేరి "ఇప్పటికయినా మీ కోపం పోయిందా?" అనడిగింది.

శాస్త్రి చటుక్కున లేచి బయటి కొచ్చేశాడు. బయటరుగు మీద పూర్ణయ్య నిద్రకు జారుకుంటున్నాడు. అలికిడికి మెల్లగా తలెత్తి, "మా భోజనాలవీ అయ్యాయి. ఇప్పుడు గదికేం వెడతావు గానీ - ఇక్కడే పడుకో లోపలికి వెళ్ళి తలుపు గడియ పెట్టు" అనేసి, ఆయన మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

• • •

శాస్త్రికి యిప్పుడు నలుగు రాడపిల్లలూ ఇద్దరబ్బాయిలూను. పెద్దమ్మాయి వసంతకు కిందటేడాది పెళ్ళయింది. పెళ్ళికి ముందు వసంత "నే నసలు పెళ్ళి చేసుకోను మొర్రో!" అని మొత్తుకుంది. శాస్త్రి పాపం! చాలా ఓపిగ్గా-పెళ్ళాడితే కలిగే లాభాలూ, సుఖాలూ వివరించి చెప్పాడు. అయినా ఒకంతట ఆ పిల్ల వినలేదు. కోప్పడి, బెదిరించి, ముహూర్తం వరకూ గదిలో పెట్టి తాళం వేసి కడకు పెళ్ళి చేశాడు.

ఆ పిల్లకో ఆడపిల్ల. రెండు నెల్ల మనవరాలితో ముచ్చట్లాడుకుంటూ శాస్త్రి

# శీతల శిఖరాలు

నేను చుట్టూవున్న జనాన్ని గమనిస్తూ ఒక్కొక్క మెట్టే మెల్లిగా ఎక్కుతున్నాను.

మా ఎదురుగా రకరకాల వాళ్ళు దిగివస్తున్నారు.

కొందరి చేతుల్లో ట్రాన్సిస్టర్లు వున్నాయి.

కొంతమంది వేరు శనక్కాయలు నములుతున్నారు.

నలుగురు ఆడపిల్లలు కాలేజీస్టూడెంట్స్‌లా వున్నారు. దాదాపు ఒకే వయసులో వున్న వాళ్లు ఏదో చెప్పుకుంటూ కిలకిల నవ్వుతూ దిగివస్తున్నారు. వాళ్ళలో ఒక అమ్మాయి మాతో నడిచి పైకి ఎక్కుతున్న భాస్కరాన్ని చూడగానే 'భాస్కరం!' అంటూ దగ్గరగా వచ్చింది.

"హలో! సత్యా!" భాస్కరం ఎంతో ఆడంబరంగా, ఆ అమ్మాయిని చూడగానే కలిగిన ఆనందం దాచుకోనట్టు చూస్తూ పలకరించాడు.

సత్య! ఆ పేరు నాకు బాగా గుర్తుంది.

సుభద్రమ్మగారి నోటినుండి రోజుకి కనీసం రెండు మూడు సార్లయినా వింటూ వుంటాను.

సత్య తనపక్క వున్న అమ్మాయిని భాస్కరానికి 'నా ఫ్రెండ్' అంటూ పరిచయం చేసింది.

భాస్కరం. ముందు గోపాలాన్ని సీకని, తర్వాత నన్ను పరిచయం చేశాడు.

నాగురించి పరియం వినగానే 'ఓ! అంటూ చూచింది. వెడల్పుగా వున్న ఆ కళ్ళలో కుతూహలం కదలటం నేను గమనించక పోలేదు.

"మిమ్మల్ని గురించి అత్తయ్య చెప్పగా విన్నాను." అంది నమస్కరిస్తూ. నేను ప్రతి నమస్కారం చేశాను.

నా కళ్లు క్షణంసేపు ఆ అమ్మాయి ముఖం మీద పరిశీలనగా నిలిచి పోయాయి.

అంత పొడుగూ. పొట్టిగాని విగ్రహం.

తెల్లటి చీర. తెల్లటి జాకెట్టు.

---

**సీరియల్**

---

చేతులకి తెల్లటి గాజులు తప్ప యింకే అలంకరణ లేదు. అయినా సరే. కళ్ళకి పెట్టుకున్న కాటుక. నుదుట మీద సరిగ్గ కనుబొమల మధ్యపైకి వున్నట్టుగా వున్న గుండ్రటి బొట్టు యివే యీ రెండే ఎన్నో ఆభరణాలు పెట్టుకున్నంత కళగావుంది.

నిలబడట్టంలో, చేతులు జోడించటంలో ఎంతో పొందికతనం కనిపిస్తూంది.

"రా. మాతో కాసేపు కూర్చుందువు గాని." అన్నాడు భాస్కరం.

"ఉహుం. వచ్చి చాలా సేపయింది. వెడతాం."

మా అందరి దగ్గరా వీడ్కోలు తీసుకుంటున్నట్టు ఒకేసారి నమస్కారంగా చేతులు జోడించింది.

సరిగ్గా సరిపోయేది.

గోపాలం భాస్కరం యింకా ఏదో మాట్లాడు తూనే వున్నారు.

దూరంగాటాంక్ బండ్ మీద లైట్లు మిలమిల లాడుతున్నాయి

ఒక చేయి వెనక్కి ఆన్చి పరధ్యానంగా కూర్చున్న నాకు ఆ రోజు సత్య గురించి సుదర్శనంగారు చెప్పిన మాటలు ప్రతి అక్షరం గుర్తుకు రాసాగినాయి.

* * *

సుదర్శనంగారు మంచం మీద నుంచి లేవటానికి సాధ్యం కాకపోవటంతో అన్ని పనులతోపాటు సంపాదకీయం వ్రాసేపని కూడా నా మీదనే పడింది. పేపరు విషయంలో అనుకున్నంత ఆశాభంగం

యద్దనపూడి సులోచనారాణి

"వస్తాను."

మరుక్షణంలో నా ప్రక్క నుండే దిగి ఇద్దరూ వెళ్ళిపోయారు.

మేం పైకి ఎక్కుతుండగా, నేను వెనక్కి తిరిగి చూడకుండా వుండలేక పోయాను.

ఎవరో మనుష్యులు అడ్డు రావటంతో వాళ్ళు మాకు కనిపించ లేదు. అందరం పైకివచ్చి పచ్చిగడ్డిలో కూర్చున్నాం.

సత్య! ఎంత చక్కటి పేరు! అని పించింది.

కాని ఆ పేరు ఆ అమ్మాయికి తగినట్టు లేదు. ఆ వినయానికి. పొందికతనానికి ఏ సుశీలో. సుగుణో అయినట్టయితే

ఏమీలేదు. ఇంగు కట్టిన గుడ్డలా. ఒకనాడు నిజంగా జ్వాలాముఖిలా వెలిగిన పత్రిక దానిలో వేడిని కోల్పోయినా జనం పూర్వపు అభిమానంతో యింకా చదువు తూనే వున్నారు. ప్రస్తుతం చేయవలసిన దల్లా దీనికి మెరుగులు దిద్దటంమాత్రమే. పాత చింతకాయ పచ్చడిలా. కొన్ని సంవత్సరాల నుంచి ఒకే మూసలో వస్తున్న దానికి కొన్ని మార్పులు చెయ్యాలి. ఇందులో కనిపించే విషయాలు ఎప్పటి కప్పుడు నిత్యనూతనంగా, సామాన్య ప్రజానీకానికి దగ్గరగా వుండేలా చూడాలి.

సాయంత్రం వేళ ఎప్పుడైనా సుదర్శనంగారి దగ్గర కూర్చున్నప్పుడు

# జరిగిన కథ

అనాథశరణాలయంలో వచ్చిన ఉద్యోగంలో యెంతో కాలం నిలవలేకపోయాను. ఇంటర్వ్యూకి వెళ్ళిన నాకు గోపాలంతో పరిచయమైంది. ఉన్నట్టుండి గోపాలానికి సుస్తీ చేయడంవల్ల అతని డ్యూటీ నేను చేపట్టి ఆ విధి నిర్వహణలో సమాజంచే దొంగగా ఊహింపబడ్డాను

బాబాయి ఏదో సంబంధం ఉన్నదని. ఆరువేలు కట్నం ఇస్తారని దాంతో తన బాకీ తీర్చవచ్చుని ఉత్తరం రాశాడు నేను ఆ సంబంధం చేసుకోను. మీ బాకీ తీర్చలేని అసమర్థుడనే అని ఉత్తరం రాశాను. గోపాలం ఆరోగ్యం కొంత కుదుట పడింది. గోపాలం బలవంతంమీద సినిమాహాలు గేటు కీపరుగా చేరటానికి ఒప్పుకున్నాను.

అక్కడ తలవని తలంపుగా పాత పరిచయస్థురాలు శాంతి తటస్థపడింది. సిగ్గుతో కుంచించుకు పోయాను గతమంతా స్మృతి పథంలో తిరగడం మొదలైంది.

తరువాత 'జ్వాలాముఖి' పత్రికనుండి ఇంటర్వ్యూ వచ్చింది. ఎడిటర్ ఆదరంతో ఆ ఉద్యోగం నాకే యిచ్చారు.

ఒక రోజున శాంతి నా కోసం గోపాలం ఇంటికి వచ్చి వాళ్ళ ఫ్యాక్టరీలో మేనేజరుగా చేరమని కోరింది. నాకు వేరే ఉద్యోగం దొరికింది మీ దగ్గర చేరలేను అని చెప్పాను. ఆలా అన్నందుకు గోపాలానికి నా మీద కోపం వచ్చింది. తరువాత గోపాలం ఆ ఉద్యోగంలో చేరాడు

—ఇక చదవండి.

నేను మెల్లగా యీ విషయం ఎత్తేవాడిని. ఎందుకోగాని ఆయన చప్పున నా అభిప్రాయాన్ని ఒప్పుకునే వారు కాదు. దీనికి కారణం ఎదుట వారు చెప్పిన విషయాలు ఒకటికి పదిసార్లు ఆలోచించి దాని లోతుపాతులు పరిశీలిస్తేగాని అంగీకరించని ఆయనమనస్తత్వం అని తర్వాత తర్వాత క్రమంగా తెలిసి వచ్చింది.

ఆయన మనస్తత్వం చాలా విచిత్రమైంది.

ఏ విషయం చెప్పినా వెంటనే అంగీకరించరు. పూర్తిగా వ్యతిరేకంగా మాట్లాడుతారు. దానిలో లోటుపాట్లని వేలెత్తి చూపిస్తారు. విమర్శిస్తారు. చివరికెప్పుడో. ఇకయీ యిష్టం ఒప్పించటం అసంభవం అని మనం నిరాశ చేసుకున్నప్పుడు మనతో ఏకీభవిస్తున్నట్టు చెప్పి ఆశ్చర్య పరుస్తారు.

పత్రిక విషయంలో కూడా యిలాగే జరిగింది.

నేను చూపించిన మార్పులకి ఆయన చూపించిన వ్యతిరేకత చూసి నేను నోట్లోంచి మాటరానట్టుగా కూర్చుండి పోయేవాడిని.

అలాటి సమయంలో సుభద్రమ్మగారు నాకు మద్దతుగా వచ్చేది. నావైపు ఆయన తర్కాలికి దిగేది.

ఇద్దరూ యిరుపక్షాలు అయి వాదనకి దిగినప్పుడు నాకు అక్కడ కూర్చోవటం చాలా యిబ్బందిగా వుండేది.

సుదర్శనంగార్కి నేను నచ్చచెప్పలేకపోయినా, సుభద్రమ్మగారు నా తరఫున నిలబడి, నా అభిప్రాయాలు బలపరచటంతో నైతికంగా నాకు దృఢమైన విశ్వాసం కలగ సాగింది.

దాంతో రాను. రాను. క్రమేణా పిదప యీనా సలహా సంప్రదింపులకి ఆయన కంటే ఆవిడ దగ్గరకే ఎక్కువ వెళ్ళ సాగేను.

పత్రిక విషయంలో పూర్తి స్వాతంత్ర్యం యిస్తున్నట్టు ఆవిడ పదే పదే స్పష్టంగా తెలియపరుస్తూ వుండేది.

నేను ఆ రోజు వాళ్ళింట్లో అడుగు పెట్టేసరికి భార్యా భర్తలిద్దరూ ఎందుకో ఘర్షణపడుతున్నారు.

మాటలు బిగ్గరగా వినిపించటంతో ముందు గదిలోనే ఆగిపోయాను.

"యింతకంటే యింకోమార్గం లేదు మరి" అంటున్నారాయన.

"మీరెప్పుడూ యింతే. నన్ను బాధ పెడితేగాని మీకు ఆనందంరాదు." దుఃఖంతో పట్టుకుపోయిన కంఠంతో అన్నారావిడ.

"నన్నేంచేయమంటావో చెప్పు!"

"మీరు నోరుతెరిచి అడగాలేకాని ఎవరైనా అప్పిస్తారు."

"అప్పా! ఆ పని నావల్లకాదు. ఇంత వరకూ యీ చెయ్యి ఇవ్వటమేగాని తీసుకోవటం ఎరగదు. నేనిప్పటికే సగం చచ్చిపోయాను. నన్నింక చంపకు." వరండాలో నిలబడి అంతరంగికంగా వున్న ఆ సంభాషణ వివరం నాకు బాగా వినిపించలేదు.

నా వునికిని తెలియచేయటానికి అన్నట్టు బిగ్గరగా దగ్గాను.

"ఎవరో వచ్చినట్టున్నారుచూడు." అన్నారాయన.

ఆవిడ బైటకివచ్చేలోపలే నేను లోప




లకు అడుగుపెట్టాను.

“రవి” నన్ను చూడగానే చెప్పి. ఆవిడ నావైపు సరిగ్గా చూడకుండానే లోపలకు వెళ్ళిపోయింది.

నేను లోపలకువచ్చి ఆయన మంచం పక్కనవున్న కుర్చీలో కూర్చున్నాను.

ఆయన ముఖం కోపాన్ని దిగమింగుతున్నట్టుగా వుంది.

నన్ను చూడగానే బలవంతంగా చిరునవ్వు తెచ్చిపెట్టుకుంటూ 'రా, కూర్చో. ఏమిటి విశేషాలు?' అని అడిగారు.

“కెమెరా తీసుకువెళదామని వచ్చాను.”

“కెమెరానా? ఎందుకు?”

“పనివుంది. కొన్ని ఫోటోలు తీసుకోవాలి.”

“ఆ అల్మైరా తెరు.” అన్నారు వేలితో చూపిస్తూ.

నేను తిరిగి చూశాను. నా వెనకే వుంది అల్మైరా.

లేచివెళ్ళి తలుపులు తీశాను.

అందులో ఖరీదైన టీసెట్టు. డిన్నరు ప్లేటు ఏవో వున్నాయి. వాటితోపాటు ఓ పక్కగా కెమెరా కూడావుంది.

“రేపు సాయంత్రం తెచ్చియిస్తాను.” అన్నాను.

ఆయన తలవూపారు.

మామూలుగా అయితే సుభద్రమ్మగారు నన్ను చూడగానే ఆప్యాయంగా కుశల ప్రశ్నలు వేసినట్టు ఏదో ఒకటి మాట్లాడేది

ఈరోజు నన్ను చూడగానే లోపలకి

వెళ్ళిపోయిన ఆవిడ వదివిముషాలా ఆయినా బైటకిరాలేదు.

వాళ్ళేదో చాలా ముఖ్యమైన విషయం మాట్లాడుకుంటున్నట్టున్నారు. నేను మధ్యలో అడ్డువెళ్ళాను.'

అందుకే అట్టే జాప్యం చేయకుండా 'వస్తాను' అని చెప్పి బైటకి వచ్చేశాను. నేను వరండా దాటుతుండగా లోపలి నుంచి ఆవిడ స్వరం వినిపించింది.

"రవి ఏడీ?"

"వెళ్ళాడు."

"అదేమిటి! నేను టీ పెట్టాను."

"అది ఎవరికి తెలుసునంటావు?" కోపంగా వినిపించింది ఆయన స్వరం.

నేను ఒక్క క్షణం ఆగాను.

ఆ యింటికివచ్చే ఆవిడచేత్తోచేసిన టీ తాగి వెళితేగాని నాకు సంతృప్తిగా అని పించదు.

తిరిగి లోపలకు వెళదామా అనిపించింది.

మళ్ళీ విరమించుకుని బైటకి వచ్చేశాను.

బజారుకి వచ్చి రీల్ప్ కొన్నాను.

బాబాయి ఇంట్లో ఎప్పటిదో పాతది ఒక కెమెరా వుండేది. పిల్లికి ఫొటోలంటే తగని పిచ్చి. రీల్ప్ తెప్పించి రకరకాలుగా పిల్లలందరినీ నాచేత ఫొటోలు తీయించేది. తర్వాత నేను కాలేజిలో చదువుకునే టప్పుడుకూడా నా ఫ్రెండ్స్ కి. కోటి వాళ్ళకి కెమెరా తెచ్చి నేనే ఎక్కువగా ఫొటోలు తీస్తూవుండేవాడిని

మావూళ్ళో పెళ్ళి. పేరంటం. ఏ సందర్భం వచ్చినా నన్ను ఫొటోలు తీయటానికి రమ్మనమని కబురు చేసేవాళ్లు.

దాంతో బాబాయినన్ను అప్పుడప్పుడూ వ్యంగ్యంగా ఫొటోగ్రాఫర్‌గారూ అని పిలుస్తూ వుండేవాడు.

ఒకసారి బాబాయి ఒంటి మీద చొక్కా లేకుండా వెల్లకిలా పడుకుని. నోరుతెరిచి. కళ్ళు సగం తెరిచినట్టు కోడి నిద్ర పోతున్నట్టు గుర్రుపెడుతుండగా ఫొటో తీశాను.

ఆయన ఫొటో పిల్లలెవరో చూసి 'నాన్నా! అన్నయ్య నీ ఫోటో తీశాడు. ఇదుగో' అంటూ యిచ్చేశారు.

ఆ రోజు నేను ఇంట్లో అడుగుపెట్ట గానే ఆయన తిట్టిన తిట్లు జన్మలో మర్చి పోలేను. హిరణ్యకశిపుడు అవతారం ఎత్తాడు.

ఆ తర్వాత చాలా రోజులవరకూ ఆ ఫొటో తీసిన కోపం మనసులో పెట్టుకుని నన్ను చీటికి మాటికి తిడుతూనే వుండే వాడు. ఆ రోజుల్లో తమాషాగా. అల్లరి చేసినట్టుగా నేర్చుకున్న ఆ ఫొటోగ్రఫే యీనాడిలా నాభుక్తికి వుపయోగపడు తుందని కలలోకూడా అనుకోలేదు.

---

రచయిత: చాలా మంది ప్రచురణ కర్తలకి నా మీద ఒకే విధమైన అభిప్రాయం ఉందోయ్.

స్నేహితుడు: అంత ధైర్యంగా ఎలా చెప్పగల్గుతున్నావ్?

రచయిత: ఆ! ఏముంది. నేను పంపిన కథలని పది పత్రికలవారు పదిలంగా తిప్పి పంపించేసారు.

కెమెరా తీసుకుని సరాసరి కూలిపేటకి వెళ్ళాను. అక్కడున్న మురికిగుంటలు, ఇరుకుసందులు, చీమిడి ముక్కులతో దిగంబరంగా తిరుగుతున్న చిన్నపిల్లలు. సరైన ఆహారంలేక బొమికలు పొడుచుకు వచ్చినట్టు యింటిముందు కూర్చునివున్న వృద్ధులు. చాలీచాలని బట్టలతోవున్న ఆడవాళ్ళు. వీటన్నిటిని మంచిమంచి కోణాల్లో ఫొటోలు తీసుకున్నాను.

ఏ విషయం గురించి ఆయినా కళ్ళకు కట్టినట్టు చెప్పాలంటే ఆ విషయం ఉన్నది వున్నట్టు చూపిస్తే సరిపోదు.

దాని పక్కన పూర్తిగా వ్యతిరేకమైన విషయం నిలబెట్టాలి.

అంటే తెలుపు ప్రత్యేకత తెలియాలంటే దాని సరసన నలుపు నిలబెట్టాలి. అలాగే మంచి గురించి కీర్తించాలంటే చెడుని దూషించాలి.

ఆ విధంగానే దారిద్ర్యంకూడా

దారిద్ర్యం సరసన ఐశ్వర్యాన్ని చూపిస్తే దరిద్రంలోవున్న శోభ. అశాంతి. దురదృష్టం హృదయానికి హత్తుకుపోయేలా కన్పిస్తాయి.

అందుకే వీటితోపాటు, ఇంకాకొన్ని ఫొటోలుకూడా సేకరించాను. అవి అందమైన మేడలు. ఖరీదైన కార్లు. మనుష్యులకంటే ఏపుగా, బలంగా పెరిగి పొగరుగావున్న కుక్కలు, కూర్చుంటే లేవలేక, లేస్తే కూర్చోలేకున్నట్టున్న గుండ్రటి ఆకారాల్లోవున్న మనుష్యులు. ఖరీదైన బేబీలతో. చీరలతో వానిటీబాగ్ లతో, కళ్ళకి కూలింగ్‌గ్లాసెస్‌తో, అధునాతనంగా, అందంగా, ఐశ్వర్యానికి అవధి యింతవున్న ఆడవాళ్ళు ఇవికూడా సేకరించాను.

"యిదీ మనదేశం!" అన్న పెద్దపెద్ద అక్షరాలతో హెడ్డింగ్ పెట్టాను.

దాని క్రింద యీ ఫొటోలు జతచేసి ప్రచురిస్తూ ఒక వ్యాసం వ్రాసాను. ఆ వ్యాసంలో, యీదేశంలో చదువుకున్న వాళ్ళకి, సామాన్యతరగతి వాళ్ళకి జరుగుతున్న అన్యాయాలు, సంఘంలో పరపతి లేని వాళ్ళు పడే అవస్థలు, డబ్బులేని వాళ్ళు పడేబాధలు వాడియైన పదాలతో, నిరుద్యోగం మూలంగా నేను పడిన వేదనంతా అక్కడ తీర్చుకుంటున్నట్టుగా వ్రాసాను.

ఈ వ్యాసం చాలామందికి నచ్చుతుందని నాకు నిష్కంగా తెలుసు. ఎందుకంటే నా చుట్టూరా యీ సంఘంలో నా లాటి వాళ్ళు చాలా మంది వున్నారు ఎవరికి వారే దీన్ని తమ జీవితానికి అన్వయించుకుంటారు.

ఇక వున్న వాళ్ళ గురించా.

వాళ్ళకి కోపం వస్తేరావచ్చు.

కానీ సాధారణమూలు పడివున్నట్టున్న యీ పేపరు వాళ్ళ దృష్టికి అందుతుందని నేను అనుకోను.

ఒకవేళ అందినా మంచిదే.

ఒక్కొక్కసారి అందరం కూడా మంచి పబ్లిసిటే.

పత్రిక సర్క్యులేషన్ పెరగాలంటే ఏదో ఒక సెన్సేషన్ రావాలి. అది తీసుకు రాగలగాలి.

నేను యీ వాస్యం వ్రాస్తున్నట్టు సుదర్శనంగారిక్కూడాని. సుభద్రమ్మగారికి గాని చెప్పలేదు.

ఇది నా మొట్టమొదటి వ్యాసం.

పత్రిక సర్క్యులేషన్ పెంచటానికి నేను మొదలు పెట్టిన మొదటి ప్రయత్నం.

పత్రిక ప్రింటయి వచ్చింది.

పేపర్ తీసుకుని పేజీలు తిప్పుతుంటే నా చేతులు స్వల్పంగా కంపించాయి.

తను జన్మ యిచ్చిన మొదటి శిశువుని చూసుకునేటప్పుడు స్త్రీ పొందే అనుభూతి యిలాగే వుంటుందేమో అనిపించింది.

ఆ వ్యాసం నేను వ్రాసినట్టుగాకుండా అప్పుడే చూస్తున్నట్టుగా. నాకు బొత్తిగా గిట్టని విరోధి ఎవరో వ్రాసినట్టుగా. పూర్తిగా విమర్శనా దృష్టితో చూసుకున్నాను.

పర్వాలేదనిపించింది.

సాయంత్రం సుదర్శనంగారి దగ్గరకు వెళ్ళాను.

ఆయన అప్పటికే యీ పేపరు చూసేసి వుంటారు.

ఆయన మెచ్చుకున్నా. మెచ్చుకోక పోయినా నా పనిలో నాకు సంతృప్తి కనిపించింది. ఆయన చూపించబోయే లోపాలు ఏమిటో నాకు ముందే తెలుసు కాబట్టి ఒకవేళ ఆయన బాగాలేదన్నా నేను అధైర్యపడకూడదు. నిరుత్సాహ పడకూడదు. అనుకుంటూ నన్ను నేనే వెన్ను తట్టి ధైర్యం చేసుకొంటూ వెళ్ళాను.

ఈ సమయంలో ఆవిడ లోపల ఎక్కడో పనిచేసుకొంటూ వుంటారు.

ఆయన బెడ్ మీద నుంచి కదలలేదు.

అందువలన సాధారణంగా తలుపు
మూసేవుంటాయి.

నేను కాలింగ్ బెల్ నొక్కాను.

ఐదునిముషాల్లో తలుపులు తెరు
కున్నాయి.

తలుపు తీస్తున్నది ఆవిడే అన
న్నాను. మామూలుగా పలకరింపుగా
వాటైన చిరునవ్వు నవ్వాను.

కానీ తలుపుతీసి నా ఎదురుగా
బడింది ఆవిడ కాదు సత్యవతి.

లోపలకు అడుగువేయబోయిన నే
ఆగిపోయాను.

ఆ అమ్మాయి కూడా బహుశా నేన
వుంటానని అనుకోలేదేమో! ఒక్కక్ష
అలాగే నిలబడిపోయింది.

పెద్దవిగా. విశాలం
వున్న ఆ కళ్ళలోకి చూస్తున్న నే
ఒక్క నిముషం నన్ను నేను మర్చిపో
వట్టు నిలబడిపోయాను.

"ఎవరమ్మా వచ్చింది!" యింట
లోపల నుంచి వినిపించింది.

"వస్తున్నా మావయ్యా!" అ
సత్యవతి "రండి లోపలకు." అ
లోపలకు వెళ్ళింది.

"ఎవరమ్మా?" ఆయన అడగ
మళ్ళీ వినిపించింది.

"ఆయనే మావయ్యా!"

"ఆయనంటే!"

"తను."

---

"నే నివాళ నుంచి పందెములు కట్టడం మానేస్తున్నానోయ్!"

"అలాగని గ్యారంటీ ఏమిటి?"

"ఎంతెంత పందెం?"

---

"తనా? తనెవరమ్మా?"

నేను లోపలకు వెళ్ళాను.

ఆయన నన్ను చూడగానే. 'నువ్వా' అన్నారు.

నేను వెళ్ళి లోపల కూర్చున్నాను.

ఆయనకి కాస్త స్వస్థత చిక్కినట్టుంది. లేచి కూర్చుంటున్నారు.

ఆయన మంచం పక్కని టేబిల్‌మీద పేపర్ వుంది.

అది మడతపెట్టిన తీరు చూస్తే చదివి పెట్టినట్టే వుంది.

కొద్దిసేపు ఆయనేం చెప్పలేదు. నేను కూడా ఏమీ అడగలేదు.

"సత్యా! కాఫీ పెట్టు తల్లీ," కేకవేసి చెప్పారాయన.

"ఆమెలేరా యింట్లో?" అన్నాను

"క్లబ్‌కి వెళ్ళింది. యిప్పుడే వస్తుంది."



ఆయన పేపరు చేతిలోకి తీసుకున్నారు.

నే ననుకున్నట్టే అయింది.

పేపర్‌లో వున్న నా వ్యాసం సంగతి ఎత్తకుండా అక్కడక్కడా వున్న అచ్చు పొరపాట్లు గురించి సరిగ్గా కన్పించని ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ గురించి వ్యాఖ్యానం ప్రారంభించారు.

ఆయన ధోరణి నేను అనుకున్నట్టే వుండటంవల్ల నాకేమంత నిరుత్సాహంగా అనిపించలేదు.

ఎలాటి అడ్డు ప్రశ్నలూ వేయకుండా వింటూ కూర్చున్నాను.

ఇంతలో ఆమె వచ్చారు.

నన్ను చూడగానే వచ్చావా నువ్వు. "ఆఫీసుకి ఫోన్ చేశాను నీ కోసం" అన్నారు.

ఆయన ఎదురుగా మంచంమీద కూర్చుంటూ పేపరు చేతికి తీసుకొని నా వ్యాసం వున్న పేజీని తెరచి వెంటనే దాన్ని గురించి చెప్పసాగారు

ఆవిడమాటలు వుత్సాహంగా ప్రశంసా పూర్వకంగా వున్నాయి. "నాకు తెలుసు: అది పొగడ్త కాదు. ఇంకా. యిలాగే ముందుకు సాగిపోవాలని ప్రోత్సాహం.

పొగడ్తకి, ప్రోత్సాహానికి గల తేడా నాకు తెలుసు. నాలో ఆసక్తికి, వుత్సాహానికి రెక్కలు వచ్చినట్టు అయింది.

నాలో సుభద్రమ్మగారు చూపిన సమర్థత ఆయనికి అక్షరాలా ఋజువు చెయ్యాలని అనిపించింది.

"రవీ! యీ హెడ్డింగ్ యిలా ప్రతి

'మీ మాతుగారు అవులి స్తే ప్రేగుల్లెక్క పెద్దారటోయి!'

'అలాగా! అసలు నేను అవులి స్తేగా!'

---

వారం ఏదో సమస్య మీద వరవగా వచ్చేలా చూడు." అన్నారావిడ.

నేను తల వూపాను.

ఇంతలో సత్యవతి కాఫీ తెచ్చి మా ముగ్గురికీ యిచ్చింది.

"మ వ్వింకా వెళ్ళిపోలేదమ్మా?" అన్నారావిడ.

ఆవిడ కంఠంలో ఆప్యాయత తొణికిసలాడడం నేను గమనించకపోలేదు.

"లేదత్తయ్యా! నువ్వు వచ్చేవరకూ వుందామనుకున్నాను." ఎంతో అణకువగా అంది సత్యవతి.

"ఇతను తెలుసా? రవి".

సత్యవతి తెలుసునన్నట్టు తలూపింది.

"మా మేనకోడలు సత్య." ఆవిడ నాకు పరిచయం చేసింది.

నేను తెలుసు నన్నట్టుచూశాను.

సత్యవతి అక్కడే మాతోపాటు కూర్చుంది.

మా ప్రసంగం పత్రికవైపు మళ్ళింది.

ముగ్గురం దాని బాగోగులు గురించి వర్ణిస్తున్నట్టుగా మాట్లాడసాగాం.

సత్యవతి పేపరులోకి చూస్తూ కూర్చుంది.

ఒకటి రెండుసార్లు నాకు తెలియకుండానే నా దృష్టి ఆ అమ్మాయివైపు మళ్ళింది.

తల దించుకుని పేపరులోకి చూస్తున్న ఆ ముఖం పక్కనుంచి చూస్తుంటే. నునుపైన ఆ చెంపలు,వాటి నాజూకుతనం గమనిస్తే. గులాబీ రేకుల్లోని మృదుత్వం గుర్తుకు వస్తుంది. నేను చదువుకునే రోజుల్లో అందమైన ఆడపిల్లలని చాలా మందిని చూశాను. వున్న సౌందర్యం వేయిరెట్లు ఎక్కువగా కన్పించేట్టు చేసుకోవటంలో చతురులు.

చీర సింగారించుకోవటంలో. నగలు అలంకరించుకోవటంలో వాళకున్న నైపుణ్యం సాటిలేనిది.

అందమైన ఆడపిల్లల్ని చూడగానే ఆ అందం సహజంగా ఆ అమ్మాయిదో లేక అలంకరణ వల్ల వచ్చిందో యిట్టే చెప్పగలను.

సౌందర్యవతులైన ఆడపిల్లలని చాలా మందిని చూశానని అనుకుంటున్న నాకు సత్యవతిని చూడగానే యింత అందమైన కళ్ళు యింతవరకూ ఎక్కడా చూడలేదని పించింది. వెడల్పుగా వున్న ఆ కళ్ళని చూడగానే నిర్మలమైన సరోవరాలు గుర్తుకు వస్తాయి.

మనకి తెలియకుండానే యింకోసారి వాటివైపు చూడాలని ఆసక్తి కలుగుతుంది.

బహుశా ఆ ప్రత్యేకత వాటిల్లో వున్న నిర్మలత్వం అయివుండాలి!

(సశేషం)

స్మశానికి వెండు మనసుకి నడుమ
పాయలు గట్టే పాల పెల్లినలాదేవుడి గుడికీ ఘోషాసుపత్రికీ మధ్య దైరీ పారం మిఱ్ఱ బూతు మధ్యతరగతి వాళ్ళకి పాలు సద్దుబాటు చేస్తుంది.

పొద్దు కూకుతోంది. అరు గంట లయినా సురసుర మే నెల ఎండ బంతి పువ్వులా. పారాణిలా పచ్చ పచ్చగా ఎర్ర ఎర్రగా చెంపలు వాయగొడతోంది. మసగ మసగగా మనసులో మెదిలే దేవుడి కోసం. మమతలు పెంచుకొన్న దేవుళ్ళ కోసం గుడికీ, ఆసుపత్రికీ వస్తూ పోతూ దేవుళ్ళాడే భక్తులతో, బంధుజనులతో కోలాహలంగా ఆ వీధి పల్లెటూరి సంతలా వుంది.

నిద్రాహారాలు మాని. మతులుపోయి యింట్లో పిల్లలందరూ పరీక్షల భీతా హంలో యెవరి మట్టుకు వాళ్ళు దిమిశా లంతంత పుస్తకాలు ముందుంచుకొని నవిలి మింగేస్తున్నారు. గుక్కెడు కాఫీ తాగుదామని ఆఫీసునుండి ఆవురావురు మనొస్తే యింట్లో పాలచుక్కలేదు. పోనీ మొహం తడుపుకుందామంటే కొళాయి రాలేదు. నీటిచుక్కలేదు. కుర్రాళ్ళెవరూ నా యిబ్బందులు పట్టించుకునేటట్టు లేరు. ఒట్టలేనా మార్చుకోకుండా పాలసీసా పట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ యీసురో మంటూ బయల్దేరేను. అప్పుడే క్యూ పెరిగిపోయింది. అంతో యింతో మడత నలగకుండా పీటుగా డాబు. నరిగానే వున్నామ. కర్మ అనుకుంటూ తోకలో తెల్ల పెంద్రుకలా నేనూ నిలబడ్డాను.

బంగీలు, జేబులేని స్లేక్ పరులూ, పిసుగేగిన కాలర్లు, బటన్సులేని చొక్కాలు మాసికల పంట్లాములు మాసిన గడ్డాలు అరిగిన చెప్పులూ చిరిగిన బూట్లు కంపు కొడుతున్న మేజోళ్ళు. అంతా ఆ క్యూలో నిలబడ్డ వాళ్ళంతా. అంతో యింతో చదు వుకున్న వాళ్ళు. నౌకరీలు వుద్యోగ సద్యోగాలు వెలగబెడుతున్న వాళ్ళు. నెల జీతాలతోబాటు విసరో కొసరో కష్టీలు కొడుతున్నవాళ్ళు జానా బెత్తెడు మహా జనులు-జాతి వెన్నెముకలు. సర్కసులో జపూన్ తొడుక్కునే కోటుమీద రంగు రంగుల మాసికల్లా వున్నారు. చిలవ కళ్ళ లోంచి చందమామ రాండుదిని తేరిపార చూసి విబ్బరపడిపోతున్నారు. చిటికిన వేలుకి, ఉంగరం వేలికి నడుమ షాహీ దక్కను సిగరెట్టు నిలబెట్టి పాదుషాలా పిడికిలి బిగించి దమ్ములాగే తమ్మ యత్వంలో చిన్న యానందాన్ని చవి జూస్తూ సంబరపడిపోతున్నారు. అంతలో అంత-మనిషికొక పేజీ పంచుకుని పేపరు చదువుతూ, వుండుండి గురగురలా దే పెరిగిన గెడ్డాలను తడుముకుంటూ ప్రభుత్వాన్ని. అరాచకాల్ని బూతులు తిడు తున్నారు. దోపిడీ వ్యవస్థని ఏదేశాంగ నీతిని ఏకి పారేస్తున్నారు. గర్జిస్తూ గాండ్రుమంటూ, ఓండ్ర పెడుతూ, వకి లిస్తూ, బూకరిస్తూ, హుంకరిస్తూ, గుమస్తా చీదరిస్తూ, ముక్కుతూ మూలుగుతూ పాలవాడికోసం అందరూ తహ - తహ లాడిపోతూ ఎదురు చూస్తున్నారు.

కళ్ళి ఒడ్డుమీద ఒల్లీ సోదాలు, కుయ్యో కుయ్యోమని ప్రాణాలొదిలేస్తున్నాయి. ఆ మొర వినబడకుండా గుడిలో గంటలు టంగు టంగుమని చెవులు హోరెత్తిం చేస్తున్నాయి. పెద్ద రింగు చుట్టూ చిన్న

చిన్న రింగులు గిలించి జోడించి గల్లు గల్లుమనిపిస్తూ. యిాగల్ని తోఇకుంటూ వేరుసెనగపప్పు. పిడతకింద పప్పూ అమ్ముకుంటున్నదొకడు. గుడి చపటా మీదే పెట్టుపొయ్యి. బొగ్గుల కుంపటీ పెట్టుకొని వేడి వేడిగా వేగోడీలూ. పునుకులూ వేసి బేరాలు రాబట్టుకుంటున్నాడింకొకడు. నాలుగు సైకిలు చక్రాలు చేర్చి గుమ్మటం చేసి విజయలలితా. హెలెన్. వెంకటరమణమూర్తి ఫోటోలు తగిలించి. షోకుచేసి. గేసుపొయ్యి పెట్టి అందులోనే మసాలా కోడీలు. కబోడీలు పోమాసాలూ దడిమేడుగా వేడి వేడిగా వేస్తూ వేయిస్తూ. వచ్చి పచ్చి జలాజీలూ బంగాళాదుంప మసాలా కుర్మా కుత-కుత ఉడికిస్తూ. ఘుమ ఘుమ లాడించి పోటీ పెట్టేడు మెరుతువలెరిగిన పింఢీవాలా. ఒకడు గరిట. మరొకడు బొల్లగరిట తిప్పుతూ బెదిరించుకుంటూ కొరకొర చూసుకుంటున్నారు. దూ ర టీ లు చే సి యిళ్ళకి తిరిగిపోతున్న మెకానిక్కులూ. ఒక కలాసీయి. గానకొట్టి అలసిపోయిన రిక్షావాళ్ళూ పోతూపోతూ మధ్యలో ఆగి మోకాళ్ళమీద కూర్చుని వేడి వేడిగా నోరూరుకొంటూ తింటున్నారు. నడి రోడ్డుమీద బచ్చాలు. గోళీలు ఆడుకుంటున్న కుర్రాళ్ళు పప్పులూపకోడీలు కొనుక్కుంటున్నారు.

కడుపులో ఆకలున్నా జేబుల్లో దుడ్డు లేక....పాల టిక్కట్టు మినహాపైసాకి కాణీలేక....చిల్లర మల్లర ఖర్చులకి అవసరమని సాహసంలేక....కొనుక్కోలేక కడుపు కట్టుకోలేక....వాసనల్ని మేస్తూ. గుటకలు మింగుతూ కొందరూ ....డబ్బున్నా వరుసకి భయపడి కొందరూ....ముందుకి రాలేక వరసలో కుదురుకోలేక గిలగిల తన్నుకుంటున్నారు క్యూలో....పాల లారీ యెప్పుడొస్తుందా. గుక్కెడు కాఫీ యెప్పుడు దక్కుతుందా అని విలవిలలాడి పోతున్నారు. ముందు వాడో వెనకవాడో పకోడీయేనా కొనక పోతాడా .... మర్యాదకోసం ఆఫరు చెయ్యడా అని నీళ్ళు నములుతూ ఆశ చూపులు చూస్తున్నారు.

"బాబూ .... నాయనా .... ఒక్కగా నొక్క కొడుకుబాబూ....చచ్చిపోతన్నడు మందులేక చచ్చిపోతున్నడు నాయినా.... గోషాలాస్పటల్లో పడున్నడు....యిాడ్ని పారేస్తారట....నాన్న మందుకొనుక్కు రమ్మన్నరు .... అయిదు రూపాయలున్నాయి....ఆరురూపాయలింట సత్తేసావు అని పెట్టి నన్నారు మందుల సాపులో. ఒక్క రూపాయి సద్దండి బాబులూ. అవకాశిల్లి మూడి,గుండెలు బాదుకుంటూపూరా చ్చేపినాను పూరుకానూడు. ఒక్క మాలిం దాచ్చి. నడుగుచ్చి మింగేసినాను. నా నుంచిపోయను ... యిాదొక్కడే బతికున్నోడు బాబయ్యా..." అంటూ ఘోషాస్పటలు గేటులోంచి యిాదురు గాలిలా దూసుకొచ్చిందో ఒక మనిషి. విడిపోతున్న జుత్తు వేలు ముడివేసుకుంటూ.

అందరూ అటువేపు తిరిగేం. రేగిన శోకంలాగ. చెలరేగిన దుఃఖంలాగ. పిడచగట్టిన వేదనలాగ-నల్లగా పొట్టిగా వుంది. నడివయసులో వుంది. ముతక సైను కోరా గుడ్డ కోకలా చుట్టబెట్టుకుంది.

"ఒల్లోడి పేగు పెగిలిపోతంది నాయి

న్లారా...రక్షించండి ... నా పెన్మ(వాల్ని మీ చెప్పులు కుడతాను ..మీ యింట్లో అంట్లుతోమి మీ ఋణం తీర్చుకుంటాను. ఒక్క రూపాయి సద్ది దినాయిన్నాయినా. నచ్చి మీ కడుపున పుడతాను. నా బిడ్డని బతికించండి బాబూ ... కడుపుకోత భరించలేను తండ్రీ.. నాన్నా ఒక్క రూపాయి . తలో పదిపైసాలు చాలు బాబూ...అయ్యవింటే ఆడకూతురి ..దయ తల్చండి ... ఆపదకాయండి బాబూ... రూపాయి ... ఒక్క రూపాయి ... నా కొడుకు .. ఒక్కగానొక్క కొడుకు" అంటూ గుండెల్ని కోరేస్తూ, కడుపు దేవేస్తూ వెక్కి వెక్కి ఏడుస్తోంది. కాళ్ళా వేళ్ళా బడుతోంది.

లుంగీ లకి జేబులుండవు. స్లాక్ షర్టు లకి జేబుల్లేవు వున్న జేబుల్లో డబ్బుల్లేవు వున్నా విదల్చడానికి చెయ్యాడదు మన సుంది. లేమిలో కరుకుదేరింది. చేతగాక వెక్కిరించింది.

"తండ్రి లేడా?"

"గెంజినేక గుంటలు కల్లు తేలేస్తే... గుండి బే..రెత్తి పరారై పోనాడు. ఆడు ఉంటే నాకీ పాట్లెందుకు నాన్నా..."

"అలా చెప్పు ... అదీ సంగతి." అని అదోలా నవ్వేడో పెద్దమనిషి క్యూలో చెవులు తుడుచుకుంటూ.

"అసలున్నాడా అని." అన్నాడు నా ముందున్న వాడు పెద్ద జోకు వేసినట్టు తనలో తానే నవ్వేసుకుంటూ.

కుప్పలా కూలిపోయిందా ఆడది. రోషంగా చూసింది. యీనిన పులిలా గుర్రుపెట్టింది. దిక్కుమాలి అసహాయంగా వుస్సురంది

పరువుకోసం కవివారాలు చేస్తూ, గుట్టుగా చాలీ చాలని బ్రతుకులు బ్రతుకు తున్న చదువులూ, వుద్యోగాలూ, హోదా అంతస్తూ వున్న మేలిముసుగులు. నిజాన్ని చూడలేవు. లేమిని అంగీకరించ లేవు. తిరగబడే మనసుని తొక్కి పారేసి అంతూ పొంతూలేని ఆలోచనల్లో మునిగేస్తాయి.

"ఆస్పత్రిల్లో మందివ్వరా? యిదెందు కుకొనుక్కోవాలి? అలా అయితే దర్మాసుపత్రెందుకటి నా మొహం అంతేనండీ... పేదవాళ్ళంటే పరాకారం." అన్నాడు క్యూలో మరొకడు మొహం చిట్లించి విమర్శలో దిగుతూ.

"స్టాకులో వుంటే యిస్తారు. వస యాని కుందొద్దూ?" అన్నాడింకొకడు.

"ఉండకేం వవుతాయి? గవర్నమెంటాస్పత్రికదా?"

"ఎలా వుంటాయి? ఊళ్ళో మందుల షాపుల గోడౌనులు నిండాలి, పెద్ద డాక్టర్ల ప్రయివేటు ప్రాక్టీసులకి సరిపోవాలి. ఎక్కడ నుండూడిపడతాయండీ? ఎలా వుంటాయండీ?"

"ఊపిరాడక గుంటడు సచ్చిపోత న్నడు. తలో పైసా సద్దండి నాన్నా."

"ఏయ్ ఏంటిగోల, మమ్మల్ని విల బిధవివ్వవులాగుంది పోతావా పోవా... వెధవసావ.." అని కసురుకున్నారు వాళ్ళు- తత్వవిచారణకి అడ్డొచ్చిందని.

తలొంచుకొని, ఒళ్ళాతుకుని మరొకరి దగ్గరికి పోయిందా దౌర్భాగ్యురాలు.

"పాపం! రామరామ ..అలా కసిరి పారేసేరేంటండీ" అన్నాడొకడు జాలిగా.

"మన చిక్కుల మాటేవిటండీ మన

బాధ ఎవరు తీరుస్తారు? ఈ వ్యవస్థ మారాలి. యీ సమాజం సమూలంగా కూలిపోవాలి ... బతుకులు బాగుపడాలి. వేరో మార్గం లేదు మాస్టారూ." అన్నాడో యువకుడు తీవ్రంగా గొంతు పెద్దదిచేసి.

"నిజంవే ననుకోండి. కానీ, అదెలా జరుగుతుందండీ ... మనం మర్యాదగా క్యూల్లో నిలబడతాంవాయ్." అన్నాడు వా ముందున్న వాడు.

"తిరగబడాలి తుడిచి పెట్టెయ్యాలి" అన్నాడా యువకుడు వుక్రోషంగా.

"ఎవరి మీదండీ? దేన్ని తుడిచి పెట్టాలంటారు?" అన్నాడో ముసలాయన.

"అందరి నోళ్ళు కొట్టి. దేశంలో సంపద దోచుకుంటున్న బందిపోటు దొంగలమీద. ఈ దోపిడీ వ్యవస్థను తుడిచి పెట్టెయ్యాలి. దరిద్రగొట్టు దేశం ...ఏం వుందనండీ ... వెధవ బతుకు. వెధవ సమాజం..." అని చీదరించుకున్నాడాయువకుడు

"సమాజం..దేశం..అంతా ఆ ప్పి మనంవే కదండీ?..మన మీద మనంమే తిరగ బడాలంటారా?" అన్నాడు ముస లాయన వాదన పెంచుతూ

"పదువుకున్నోలు... కస్టపుకాలెరుగు న్నోల్లు .నా బిడ్డణి బతికించండి నాన్నా.. ఒక్క పైసా..అలకో అయిమా తలకో పదీ ఏసినా పాలు బాబూ.. రచ్చించండి"

"చెప్పేవిక్కాదూ.. వెత్తావా యిర్చి పారెయ్యనా?.. గెటవుట్! డర్టీపుమన్" అన్నాడా యువకుడు అసహ్యంగా ఛీద రించు కుంటూ లోపల బాధ పడిపోతూ

"ఆ దిక్కు మాలిన ముండ మీద.. అంత చిరాకెందు కండి...పిచ్చిక మీద బ్రహ్మాస్త్రం" అన్నాడు ముసలాయన

"చిరాకు మనిషి మీద కాదండీ...."

"మరెవరి మీద?"

"ఒక్కగానొక్క కొడుకుని బతికించు కోడానికి..మందు కొనుక్కునే ఆదరవు చూపించని సంఘం మీద....దిక్కు దివా ణం లేని దౌర్భాగ్యపు గవర్నమెంటు మీద..దోపిడీ సమాజం మీద" కోపం పట్టలేక, ఎండపొడ తట్టుకోలేక ఎర్రబడి వుడుకు బోతుగా మోచేత్తో మొహం తుడు చుకున్నాడా యువకుడు.

"అంత ఆవేశంమెందుకు బాబూ?.... ఎంత నిర్దాక్షిణ్యంగా కసిరి పారేశావ్?.... పాపం" అని నొచ్చు కున్నాడు ముస లాయన

"ఏం చేస్తాం మరి?"

"అవతల ప్రాణం పోతోందని గోల పెడుతుంటే.. సంఘం సమాజం అని దుమ్మెత్తి పోస్తే ఏం లాభం చెప్పండి.. మీ వీరావేశం అపదని కాస్తుందా?."

మరేం చెయ్య మంటారూ? అయ్యో అమ్మా అని జాలి పడిపోమంటారా?.... పెద్దవారూ..మీరే చెప్పండి...." అన్నా డాయువకుడు అక్కసుగా వెక్కిరిస్తూ

"కొంపలంటు కుంటే....మా తు యి తవ్వేరట.. అలావుంది మీసలహా..

ప్రాణం పోతుంటే.. సమాజం మారాలి సమాజం మారాలి.. యిదేం గోలండీ బాబూ"

"అదొక్కటే మార్గం..మీరూ నేనూ ఎంత మందిని ఆదుకోగలం చెప్పండి.. మన తరంమా?"

"నిజంమే.. సమాజంమంత సుల

భంగా మారిపోతుందా బాబూ..ఎంత రక్తం పారాలీ..ఎన్ని సంసారాలు కూలాలీ. యీ లోగా పుణ్యకాలం కాస్తా చక్కా పోతుంది. రూపాయి తక్కువయి మందులేక విందు ప్రాణం బలై పోతుంది. దిక్కూ మొక్కూ లేక ఆ వెర్రిముండ గుండె పగిలి చస్తుంది.'' అన్నాడు విదావంగా ముసలాయన

''అందుకే శాంతి పర్వంలో. ఏమన్నారూ అంటే .అంటూ మరొకరు కలగ చేసు కున్నారు.

''అడ కూతుర్ని బాబూ.. బిడ్డకు సచ్చి పోతన్నదు'' అని మద్య కొచ్చి జోరీగ లాగ చెవులో గూడు కట్టి పోరు పెట్టిందా కిర్పాగ్యురాలు

'ఛీ..పో''అని కసిరేశాడా భారత వేత్త తన మాటకి అడ్డొచ్చిందని వుడుక్కుంటూ

పాపం చిన్న మొహం చేసు కుందా దురదృష్టవంతు రాలు.

''అవుతే మనంవేం చెయ్యగలం చెప్పండీ .'' అన్నాడా యువకుడు మళ్ళీ సీరియస్‌గా సంభాషణ పొడిగిస్తూ

''కొంచెం సానుభూతి..చిన్న సహాయం బాబూ జాలి కనికరం..పది పైసలు చిల్లర .పదిమందీ కలిస్తే. ఆ యిల్లాలి అపద గడుస్తుంది....'' అన్నాడు ముసలాయన

"ఆ పనేదో తమరే చెయ్యొచ్చుగా.. మాకెందుకీ ధర్మ పన్నాలూ?''

''ఆ మాత్రం ఉంటే యింత వాదెందుకు బాబూ..యింత సేపా?'' అన్నాడు ముసలాయన జాలిగా నవ్వి కాళీ జేబులు తడుము కుంటూ.

పై మీద కండువాతో చెమ్మగిలే కళ్ళు తుడుకుంటున్నాడు. ''మానం సంపుకుని యీదిన వచ్చాను నాయన్లారా..నా దురద్దుష్టాన్ని ఎక్కిరించకండి నాన్నా..దిక్కుమాలి సెయ్యి సాపినాను. ఎగతాలి సెయ్యకండి బాబూ...కసురుకోకండి.. బిడ్డోడి మొకం సూసి..ముస్టెయ్యండి.. నా బుల్లోణ్ణి బతికించండి బాబుల్లారా'' అని అందరికాళ్ళూ పట్టుకుంటోంది ఆ తల్లి.

''సహాయం.సానభూతి .ముష్టి .జాలీ దయా .ఛ ఛ .అన్యాయం దోపిడీ కనబడకుండా మత్తుమందులు .తోటి మనిషంటే ఎంత చవక! ఎంత చిన్న చూపు!....ఏం దేశంరా బాబూ యిది..ఓ హోహోహో!, ఏం ధర్మాలూ!....నాన్సెన్స్! .ముష్టికింత గౌరవమా?.. వాటేకంట్రీ! ... తోటి వాళ్ళని అవమాన పరచలేను. ముష్టివేసి కించ పరచలేను..యీ సమాజం .బూజు పట్టిన ధర్మాలు న్యాయాలూ సమూలంగా కూలిపోవాలి..వ్యవస్థ మారాలి .యీ బతుకులు బాగుపడాలి..అంతే మాష్టారూ.. మరో మార్గం లేదు గురూగారూ..' అంటూ లోపల గొణుక్కుంటూ వుండబట్టలేక గాలినీ ధూలినీ తిట్టుకుంటూ,' లోకాన్ని శపిస్తూ, ముసలాయన ఒక పేద పురుగన్నట్టు జేగురించుకున్న మొహం తిప్పేసు కున్నాడు యువకుడు.

పేంటు జేబు తడుముకున్నాడు. చేతులు జేబులోనే వుండి పోయేయి. ఆ చూపులే చెబుతున్నాయి — జేబులో చిల్లులే గాని చిల్లర లేదని

నా దగ్గరుండి-మిల్లింగు లయిసెన్స్ జారీ చేసి నందుకు తాంబూలం కర్చుగా

షావుకారు యిచ్చిన పచ్చకాయితం జేబులో బరువుగా వుంది. అటపా దటపా ఆ కాయితాలు యీ కాయితాలు అటూ యిటూ తిప్పినందుకు కర్పూర్తి పద్దరూపాయిలూ రెక్కా బొత్తుగానే వున్నాయి. కాఫీ ఖర్చు పోగా మిగిలిన శివాలక్ష్మి యింకా పేంటుజేబులో ఘల్లు ఘల్లు మంటోంది.

వింతగా దీనంగా ఏడుస్తున్న నన్ను చూసి పాపం శ్రీరామచంద్రుడను కుందా అమాయకురాలు. దుఃఖంలో అల్లాడి పోతూ శాపం తిన్న అహల్యలా విలవిల తన్నుకుంటూ నా కాళ్ళ ముందు కూలబడి పోయింది.

పోనీ ఒకటి పుణ్యం చేద్దామని జేబులో చెయ్యి పెట్టేను.

"దొంగవేషాలు! గండు ముండలు.. ఆ ఏడుపు చూడండి ఎంత బాగా ..ఆ! వీళ్ళకే సినిమాల్లో ఛాన్సిస్తే...ఎవరాగుతారండీ వీళ్ళముందూ?...." అన్నారెవరో మళ్ళీ

"మన కన్నీళ్ళెవరు తుడుస్తారండీ?.. గుడిలో దేవుడా..గవర్నమెంటు పెద్దలా?. బెల్లం కొట్టిన్రాయిలు....పలకరూ వులకరూ-" అన్నారింకొకరు

"అన్నిటికీ దేవుడొకడు చవగ్గా దొరికేడు నోరూ వాయా లేదు కదా అది.... దేవుడేం చేసేడండీ! దగాలు చెయ్యమన్నాడా....వేషాలు వెయ్యమన్నాడా.... దొంగ వేషాలు!" అని మరో వ్యాఖ్యానం వినిపించింది.

"దొంగ వేషాలు-ములుకులా గుచ్చుకుందా మాట.

• • •

ఆ మధ్యనోమారు అమెరికాలో కొన్నాళ్ళూ, రష్యాలో కొన్నాళ్ళూ అవేవో పెద్ద చదువులు చదివి, పెద్ద పెద్ద వుద్యోగాలు చేసి షికారుగా స్వదేశంవచ్చి నన్ను చూడపోదామ నొచ్చేడు నా చిన్ననాటి స్నేహితుడొకడు. మూడు రోజులు నాతోనే వుండి దేశాల భోగట్టాలూ ముక్కోటి పురాణాలూ మూటలు విప్పి చూపించి వాళ్ళూరు తిరిగి వెళ్ళిపోతున్నాడు. అంత అభిమానంగా నన్ను చూద్దామని వచ్చేడని మొహమాట పడి యింట్లో కుర్రాడు సైఫా బాకుతో మంచాన పడి వున్నా బసాండు దాకా సాగనంపడానికి బయల్దేరేను.

వానజల్లులు జల్లుజల్లుగా కురుస్తూంది. వూరంతా చిత చితలాడుతోంది. కరెంటు పోయి వీధులన్నీ మసక చీకటిలో దివ్వె దివ్వె మంటున్నాయి బస్టాండు రోడ్లో దీపాలెప్పుడూ వుండవు. ఇళ్ళలో దీపాలు కూడా లేవేమో ఆ దారి గూఢ్యంలా, సొరంగంలా వుంది. కుళ్ళు కాలవలూ గోతులూ, బురదగుంటలూ కలగాపులగమైపోయి వీధి వీధంతా వూబిలా వుంది. చుట్టు పక్కలంతా కర్రల అడితీలు, కన్నాల గుడిసెలు, మట్టిముద్దలు. అందులో ఎలక కలుగుల్లాంటి యిళ్ళు. తాటాకు గొడుగుల కింద, పేకేజీ దొక్కల మీద ఆముదం దీపం గుడ్డి వెలుగులో కవాప్పుల్లలూ, వుల్లికారం పూసిన గుడ్లూ పెట్టుకుని జంగిడీలవాళ్ళు అమ్మకం. ఆ బురద ఆ మనుషులు....అబ్బ! దేశంలో దరిద్రం దౌర్భాగ్యం అంతా అక్కడే మురుగుతోంది. అనాధలూ, అన్నార్తులూ, కుష్టువాళ్ళూ, ముష్టివాళ్ళూ, బికార్లూ, బొక్కి

నులూ, ఖైదీలూ, కిల్లాడీలూ మసిలేవాళ అవి. సారా కొట్లూ, చంకబారు బూతు కొట్లూ, కిటకిటలాడే వేగల గూడు, కారడవిలాంటి పట్నం. ఆ పట్నం గుండెల్లో ఆ చోటు బ్రహ్మజెముడు డొంక-ముళ్ళ తుప్ప-అది మునిజనతాప సోత్తమైశ్వర్యం కాదు. రాకాసుల్లాంటి మనుషులూ, మనుషుల్లాంటి పిశాచాలూ తిరుగాడే అరణ్యం-దండకారణ్యం.

ప్రాణాలు పిడికిట్లో పెట్టుకుని, ఎలా గయితేనేమి బురదలో యీదుకుని బయట పడి బస్సు స్టాండు చేరుకుని బస్సుకోసం ఎదురు చూస్తున్నాం. వెన్నెదన్ను కోసం సిగరెట్లు ముట్టించి ఒకే గొంతుగులో ముడుచుకుపోయి బాతాఖానీలో పడ్డాం. బ్రతుకులూ, బాధలూ, దేశం రాజకీయాలూ అన్నీ దొర్లిపోతున్నాయి. గుడ్డి వెలుగు, ఆవదం దీపాల కింద చీదర చీదరగా వుంది.

"బాబూ!"

వులిక్కిపడి చూసేం. నల్లగా బొద్దుగా వుంది. నడి వయసులో వుంది. మురికి కారిన ముతక చీర భుజాల మీద కప్పుకుంది.

"పిల్లోడికి జబ్బు చేసినాది బాబూ.... పావు బకుకల్లో మంచం మీనపడి తన్నుకుంటున్నాడు. మందు కొనుక్కోవాల. డాకటుబాబు సీటి రాసిచ్చినాడు. సూడండి నాయనా....సాయం చెయ్యండి బాబ్బాబు మీకు పున్నెముంటుంది....నడువుకున్న మారాజులు....కష్టం సూడండి నాన్నా" అని మెల్లి మెల్లిగా వూపిరి పీలుస్తూ, ముక్కు కళ్ళూ తుడుచుకుంటోంది.

"వెళ్ళమ్మా వెళ్ళు....ఎక్కడ పడితే అక్కడా మనిషి కనబడితే చాలు" అని మావాడు విసుక్కున్నాడు.

వెచ్చగా సిగరెట్ పొగ పీల్చి గాలిలో రింగులొదులుతున్నాను.

"దిక్కుమాలిందాన్ని బాబూ! బిడ్డకు మంచం మీదున్నాడు బాబూ....మాకిచ్చేదేపాటి బాబూ! మీ సిగరెట్టు ఖర్చుపాటుండదు. కనికరించండి బాబూ" అంటూ దీనాతి దీనంగా నా కళ్ళల్లోకి చూసి దోసిలి పట్టింది.

సిగరెట్టు మీద సిగరెట్టు వేస్తూ మా వాడితో ఎచ్చి దప్పాలు కొడుతున్నాను. ఇంట్లో మంచాన పడున్న కుర్రాడు గుర్తుకొచ్చి గతుక్కుమన్నాను. కుర్రాడెలా వున్నాడో, మా ఆవిడేం కంగారు పడుతోందో! గాభరా పడ్డాను. చేతిలో రాజుతున్న సిగరెట్టు చురుక్కుమంది. ఆ మనిషి నావేపలా దిగులుగా చూస్తూ దైన్యాన్ని వర్షిస్తూంది. చిరాగ్గా సిగరెట్టు పీక విసిరి పారేసి పేంటు జేబు తడివి చేతికి దొరికిన రూపాయి నోటు ఆ దోసిట్లో పడేసేను.

"మా బాబు మా బాబే....భగవంతుడు మిమ్మల్నీ మీ పిల్లల్నీ సల్లగా సూడాలి తండ్రీ ...మంచి మనసుబాబూ! మీ పెద్దలకి దండాలు" అంటూ చేతిలో రూపాయి చూసి నమ్మలేక పదిసార్లు గుడ్డి వెలుగులో చూసుకుని వుక్కిరి బిక్కిరై పోయింది. కొంగున ముడేసుకుంటూ చేతులెత్తి దండాలు పెట్టుకుంటూ వెళ్ళి పోయింది.

"నువ్వో ఫూలువిరా....బసే....యూ ఆరే బిగ్ ఫూల్!" అన్నాడు మా వాడు కోపంగా.

"ఏంరా." అన్నాను తెల్లబోయి.

"అవన్నీ దొంగ వేషాలు కల్లబొల్లి కబుర్లకి కరిగిపోయి పైసా పరకా కాదు. రూపాయిచ్చేస్తావా? డబ్బంటే అంత విరక్త్యంగా వుందా? చక్కగా దొరుకుతోందా?" అన్నాడు సూటింపుగా.

నా కప్పుల మీద విసురు విసిరేడు. ఒక్కమారు తడుముకున్నాను. కాని వెంటనే సర్దుకున్నాను.

"పాపం... కొడుకూ.... జబ్బూ.... దరిద్రం... చూస్తూ ఎలా పూరుకోగలం రా!" అన్నాను జాలిపడుతూ.

"ఏ మొహం....ఎవరిట్రా చూపేవు? దానికి కొడుకున్నాడో లేదో...వున్నా వాడికి జబ్బుందో లేదో... నీకేం తెలుసురా? నిజవో నాటకవో.... నీకు తెలుసా?" అన్నాడు విలదీసి జడాయిస్తూ తర్కంతో నా నడ్డి విరగ్గొడుతూ.

"తెలీదురా.... కానీ ఆ గొంతులో దైన్యం దుఃఖం....నా మనసెందుకో కలుక్కుమంది."

"అది చూసి నీరైపోయేవు. అంతేనా? నాటకాలవాళ్లూ, సినిమాలవాళ్ళూ యింకా బాగా ఏడిపిస్తారు. అదంతా నిజమేనా? అవి? హారి పూలూ! ఫిల్టికంట్రీ! డర్టీ బెగ్గర్స్!" అంటూ నన్నూ దేశాన్నీ మనుషుల్నీ పట్టుకుని ఒక్క దులపు దులిపేడు.

"అంతా నాటకమంటావా?" అన్నాను అమాయకంగా.

"హాం ....బతుకురా... " అని సినికల్‌గా నవ్వేడు.

"అంటే!"

"నాటకం రా...."

వున్న సిగిరెట్లన్నీ వూది పారేశాం దగ్గరే వున్న కిళ్ళీ బడ్డీ దగ్గర గోల్డుఫ్లేక్ లేదు. మావాడు పెదవి విరిచేడు. మరోటి కొట్టడు. కొంచెం దూరం వెళ్ళి సందు మలుపు తిరిగి మరో బడ్డీ దగ్గరకు వెళ్లేం. గేస్ లైటు వెలిగి బడ్డీ కళ కళ లాడుతోంది. నేను సిగరెట్లు కొంటున్నాను.

"చూడరా" అన్నాడు మావాడు పక్కనున్న కాకా హోటలు అరుగువేపు గెద్దలా చూస్తూ.

గేసు లైటు వెలుగుతోంది. రాగి బోయిలరు చుట్టూ చేరి మోకాళ్ళ మీద కూర్చుని టీ తాగుతూ చలి కాచుకుంటున్నారు ఆ వీధిలో వాళ్ళు. కొడుకూ, మందూ అని ఏడ్చి నా దగ్గర రూపాయి ఒడికిన మనిషి కేరింతలు కొడుతూ పునుకులు తింటూ టీ సదానంగా చప్పరిస్తూంది. టీ కలుపుతున్న కాకా దాని పైటలోకి తొంగి చూస్తున్నాడు. వాడ్ని మత్తెక్కిస్తూ, పైట జార్చి వెకిలి నవ్వులు నవ్వుతోంది. మరో పునుకందుకుని యింకో చుక్క టీ పోయించుకుంటోంది.

నేను తెల్లబోయేను.

"ఆ గొంతులో యిప్పుడేం వింటున్నావురా?....విన్నా వినూ.... నవ్వా ఏడుపా? తుళ్ళి తుళ్ళి విరగబడి నవ్వుతోంది. వినలా.... చూడూ ..." అని కసిగా మావాడు మోచేత్తో పక్కలో పొడిచేడు.

వెర్రి మొహం వేసేను.

"బోధపడిందా? బతుకంటే నాటకం రా....విన్నేడిపించో నవ్వించో కవ్వించో విలువ దోపిడీలు చేస్తారు. ఇందాక విన్నేడిపించింది. యిప్పుడా కాకాని నవ్వి

స్తూంది కడుపు కక్కుర్తి అంతేగా షూల్ సింపుల్ ట్రూత్... దొంగవేషాలు. కడుపు నిండగానే మరొక్కడో బేరానికి ఎదురు కుంటుంది... డోన్ట్ ట్రై యువర్ హార్ట్ ఎరన్నా మనీ ఆ స్ట్రిక్ బెగ్గర్స్.... దొంగ ముండలు...దొంగవేషాలు" అని నన్ను ఓత్తునేసి పారేశాడు మావాడు'

కంటి ముందు కొట్టొచ్చినట్టు కనబడుతున్న నిజాన్ని కాదనలేక పోయేను. గుడ్లుమిటకరించి నోరు మూసుకున్నాను.

• • •

దొంగవేషాలు అన్న మాట వినగానే.. బస్సుస్టాండు దగ్గర ఆనాటి తతంగం వింతా నా కళ్ళ ముందు గిర్రున తిరిగింది.

కాళ్ళ ముందు కూల బడ్డ మనిషి వేపు చూసేను. నలుపూ. నడి వయసూ.. ముతక మురికి చీర....కొడుకూ....జబ్బు మనిషే నేమో! .ఏమో!..మళ్ళీ బుట్టలో పడిపోతున్నా నేమో!.. మావాడి వార్నింగు చెవుల్లో గింగురు మంది. చెంప దెబ్బ మంచి. బిర్రబిగిసి పోయేను.

"బాబ్బాబు. ఓపిక లేదు..నిలబడలేను. కనికరించండి బాబూ దిక్కు మాలిన ముండని.. తపనకాయండి బాబూ.. ఒక్క రూపాయనద్దండి నా యిన్నాయనా"అంటూ నీరాశ పడిపోయి బెక్కుతూ బెక్కుతూ తలెత్తి నా మొహంలోకి చూసింది కాళ్ళు పట్టుకుంది

మసగ చీకటిలో ఆనాడు నా గుండెని పిండేసిన చూపు అదే. ఇదంతా నాటకమా? అన్నీ వేషాలేనా? కడుపు కక్కుర్తి కోసం వేసే వేషాలేనా?.... యీదగానే. మోసాన్నీ ముష్టివేసి రెచ్చగొట్టడమా?.... జాలి పడనా?....యీబతుకే సులభం అని పిస్తుంది మారరు ఆర్థిక వ్యవస్థ చక్కబడాలి..కొత్త సమాజం రావాలి.పందికొక్కుల పణం పడిపోవాలి....యీబతుకులు బాగు పడాలి.యీగాడిదకి కరిపోయి వీళ్ళని దయతల్చడానికి నేనెవర్ని?. సాయం చెయ్యగా మావనా" నందేహంలో పడి పోయేను.

శాస్త్ర చర్చలో దిగబడి పోయా. సమాజం సంఘం అంటూ ఆలోచనల్లో మునిగి పోయేను. జేబులో చెయ్యి జేబులోనే వుండి పోయింది.

పరువుకోసం. ప్రజాభిప్రాయంకోసం ధర్మశాస్త్రాన్ని కౌగలించుకుని ధర్మపత్నిని నట్టడవికి పంపిన శ్రీరామచంద్రుడిలా గుండె రాయి చేసుకున్నాను. గుడిలో గుండ్రాయిలా పాషాణమై పోయేను.

ఎంతో ఆశగా నా మొహంలోకి చూసింది అడకూతురు. గతిలేక "రావం సెంద్రా" అని పుస్సిరంది.

కామధేనువులా గునగున లాడుతూ పాల లారీ వచ్చింది. క్యూలో కొంత చివరనున్న లారీలో తెలిసున్న మొహం వొకటి నాకొక సీసా రిజర్వు చేసింది. నా కంట్లో ఆ ఆడమనిషి మెదల్తూనే వుంది. నా గుండెలోనుకో పీకుతూనే వుంది. పాలసీసా దక్కించుకొని బిక్కు బిక్కుమంటూ యింటికి బయల్దేరేను. తీరా యింట్లో అడుగు పెట్టేసరికి—

పెట్టేసరికి... ఇబ్బే ఏమీ జరగలేదు. అందరూ బాగానే వున్నారు. ఎవరూ గుటుక్కుమనలేదు. కాని కరెంటు పోయి లైట్లారిపోయేయి కొవ్వొత్తులు పెట్టుకుని పిల్లలందరూ విశేషంలా చదువుకుంటు

న్నారు కొంతసేపటికి కరెంటొచ్చింది గుప్పుమని దీపాలు వెలిగి యిల్లంతా కళ కళ లాడుతోంది. హమ్మయ్యా అనుకుని ఆ రాత్రంతా గుండెమీద చెయ్యేసుకుని హాయిగా పడుకొన్నాను.

కానీ ..ఆ మర్నాడు

తెల్లవారిందో లేదో మా పిల్లలంతా అప్పుడే చకచకా స్నానాలుచేసి కాఫీలు తాగి పెద్ద పెద్ద పరీక్షలు రాయడానికి బయలుదేరిపోయేరు. దుఃఖం, శోకం, దరిద్రం యీ దేశంనుండెలా తరిమెయ్యాలా అని బళ్ళకొద్దీ పుస్తకాలు చిన్న బుర్రల్లో యిముడ్చుకుని నెమరు వేసుకుంటూ వెళ్ళిపోయేరు. స్నానం పానం అయ్యేసరికి ఆఫీసు వేళయింది. వుడికీ వుడకని పచ్చడి మెతుకులు మింగి ఆదరా బాదరాగా నేను ఆఫీసుకి బయలుదేరాను. అలవాటు ప్రకారం గుడి ముందాగి చెప్పులు విడిచి—

"నలుగురికి నా అవసరం కల్పించి నాలుగురాళ్ళు ముట్టజెప్పు తండ్రీ నా జీతం వేసాటి. పూట బత్తేనికి సరిపోదు. పిల్లలవాణ్ని. పెద్ద సంసారం చదువులూ కాలేజి ఫీజులూ, పుస్తకాలూ, చాల్లేక పోతున్నాను. కరుణించు మహా ప్రభో," అని కళ్ళు మూసుకుని చేతులెత్తిమొక్కుకుంటున్నాను.

"ఈ దిక్కుమాలిందానికి కరువు నెందుకు పడ్డావురోరి కొడకా....దరిద్ర గొట్టుముండప...మందుకి గతిలేక పేతు

---

• ప్రధాని నాలిక చివర్ని మాత్రమే తాండవించేది - ప్రణాళిక.

• చైనాలో పిల్లులు 'మ్యావ్, మ్యావ్' అనడానికి బదులు 'మావో, మావో' అంటాయట.

• పంచవర్ష ప్రణాళిక: ఫలించడానికి అధికంగా వర్షాల మీదనే ఆధారపడేది.

• పారిజాతా పహరణానికి కూడా సత్యాగ్రహమే ఆయుధం!

• ఎప్పుడూ 'ధుమ ధుమ' లాడుతూ ఉండే మొహం - రైలుఇంజను.

• పట్టపరీక్షలో అనేకసార్లు దండయాత్రచేసి, పెళ్ళికి మాత్రం ఉబలాట పడుతున్న సుపుత్రుణ్ని చూసి, తండ్రి "స్నాతకోత్సవానికి అర్హతలేదు గాని, స్నాతకానికి మాత్రం తయారు, బడుద్దాయి," అని కసిరాడు.

రచన జగ్గారావ్.

లారా సంపేసుకున్నావ్రో"

తల్లి పేగు మెలితబడి, చిక్కబడి బావురు మంటోంది. కడుపులో రగిలే చిచ్చు భరించలేక హోరుపెట్టే సముద్రం లాగ.

"హమ్మ కొడుకో...." అని గుండె బాదుకుని హృదయవిదారకరంగా ఏడుస్తోం దెవరో.

తుళ్ళిపడి కళ్లు తెరిచి చూసేను.

నల్లగా వుంది, నడివయసులో వుంది. ముతక మురికి చీర చుట్టబెట్టుకునుంది. ముందురోజు సాయంత్రం ఒక్క రూపాయికోసం అందరి కాళ్ళూ పట్టుకున్న దిక్కుమాలిన ధీవరాలు, హీనురాలు. నా కళ్ళు బైర్లుకమ్మేయి.

"అప్పుడే నూరేల్లూ సెల్లిపోయానాయిరో నీకూ... బికారిముండని....నా కడుపునెందుకు పుట్టినావురో." అని గొంతు పీండ్రించుకుంటూ కొడుకు శవాన్ని భుజంమీద వేసుకుని గొడ్డులా అరుస్తో ఆయాసపడిపోతోంది. చిందులు త్రొక్క సముద్రంవేపు పరుగులెడుతోంది.

ఆ ఏడుపు సుడిగాలిలా నా చెవులు దూసుకుపోయింది. పిడుగుల వానలా గుండె పగలకొట్టింది. నిర్ఘాంతపోయేను, నీరైపోయేను.

నిజంవో....అబద్ధవో .... నాటకంవో బూటకంవో...అవన్నీ నా కెందుకు? పోతే యెంత? ... ఒక్క రూపాయి. అంతేగా! జేబులో బొత్తుగా పడున్న నోట్లలో ఒకటి సులభంగా సునాయాసంగా గడ్డి కరిచి ఆర్జించిన రూపాయి. ఒక రూపాయి సద్దుపాటువేస్తే పసివాడు బతికిపోయేవాడేమో! ఆ తల్లి కడుపులో చిచ్చు లేవకపోనేమో! మనసు కలుక్కుమనగానే ఒక్క రూపాయి పారేస్తే యీ హత్య జరగకపోనేమో!

ఒక బిందుప్రాణం బలైపోయింది. ఒక తల్లి కడుపు మండి మసైపోయింది.

నా అనుమానాలూ, సందేహాలూ, ఉదాసీనతా నిర్లక్ష్యం యిలా కొంపతీస్తాయనుకోలేదు. నా తర్కాలూ వాదాలూ మరొకరిది ప్రాణసంకటం అనుకోలేదు. విషాదకరంగా ఆ పసివాడి గొంతుక పిసికేస్తున్నా ననుకోలేదు.

మనిషికీ మనిషికీ యీ లోకంలో యింత సంబంధం వుందా! బ్రతుక్కీ బ్రతుక్కీ మధ్య యింత అనుబంధం వుందా!

సమాజం మారాలి అంటూ బుద్ధిగా కుర్చీలో ఆలోచిస్తూ కూర్చుంటే యీలోగా యెన్నెన్ని మూగజీవాలు బలైపోతాయో! మమతలు కరువైపోయి మనసులు యగిరి యింకిపోయి యెందరెందరు వూపిరాడక గిజగిజ లాడిపోతున్నారో!

అలక్ష్యంచేసి ఎంత నేరంచేసేను! ఎలాంటి ఖూనీ చేసేను! యీ పరిస్థితులెప్పుడు చక్కబడతాయి? ఈ బ్రతుకులెలా బాగుపడతాయి? ఈ ఆలోచనలకి అంతులేదా? ఈ కుర్చీలకి తెంపులేదా?

నిలవలేకపోయేను. నిలువునా కూలిపోయేను.

ఎంత పొరబడ్డాను! ఎంత ఘోరం చేసేను! ఎంత దారుణం! ఎంత అమానుషం! మైగాడ్! మైగాడ్!

నా గుండెల్లో గునపం దిగింది.




## అపోలో ఆర్. ఎస్. జె.

మద్రాసు అశోకా హోటలులో జరిగిన సమావేశంలో తమిళనాడు విద్య, ఆరోగ్య శాఖామంత్రి శ్రీ వి. ఆర్. నెడుంజెళియన్ 'శ్రీరా' సంగీతంలో ప్రఖ్యాత నేపథ్య గాయకుడు శ్రీ పి. బి. శ్రీనివాస్, శ్రీమతి జానకి పాడిన పాట 'మాన్ సెట్ హిజ్ పుట్ ఆన్ మూన్' అన్న ఆంగ్ల భాషలో గల గ్రామఫోను రికార్డును ఆవిష్కరించారు

అపోలో చంద్రమండలంలో దిగిన సందర్భాన్ని పురస్కరించుకొని ఈపాట తయారు చేయబడింది.

ఈ ఆంగ్ల రికార్డు రావడానికి కారకులైన శ్రీ బి. రాధాకృష్ణ (శ్రీ గణేశ్ ప్రసాద్ మూవీస్ నిర్మాత) కొద్దిసేపు మాట్లాడారు.

నెడుంజెళియన్ మాట్లాడుతూ ఇలాంటి రికార్డును దక్షిణ భారత దేశీయులు తయారు చేయడం గొప్ప విషయం. మన సాంప్రదాయమైన సంగీతాన్ని కూడా ఇలాగే విదేశాల్లో వినిపించే ఏర్పాట్లు చేసి మన సంస్కృతీ సభ్యత వారికి తెలియ చేయాలి అన్నారు.

సమావేశానికి హాజరయిన ఎడుగురు పెద్దలకు ఏడు రికార్డు కాపీలు సమర్పించారు.

గాయకుడూ, గీత రచయితా అయిన శ్రీ పి బి. శ్రీనివాస్ అందరికీ కృతజ్ఞత లందజేసారు.



పి బి శ్రీనివాస్ రాష్ట్రపతి శ్రీ వి వి గిరిగారికి, శ్రీమతి గిరి గార్లకు రికార్డులను బహూకరిస్తున్న దృశ్యం

## కోడలు దిద్దిన కాపురం

యన్. టి. ఆర్ ఎస్టేట్ వారు నిర్మిస్తున్న ఈ చిత్రంలో శ్రీ ఎన్. టి. రామారావు, జగ్గయ్య, నాగభూషణం, రేలంగి, సత్యనారాయణ, ధూళిపాళ, మిక్కిలినేని, సావిత్రి, వాణిశ్రీ, సూర్యకాంతం మొదలగువారు నటిస్తున్నారు. యోగానంద్ దర్శకత్వంలో నిర్మాత త్రివిక్రమరావు నిర్మిస్తున్నారు.

ఎన్. టి. రామారావు నటించిన 'రెండు పందెల' చిత్రం అనంతుందనీ అక్టోబర్లో విడుదలవుతుందనీ తెలుస్తోంది

## శ్రీ రామాంజనేయ యుద్ధం

ఈ పౌరాణిక చిత్రాన్ని భారీ ఎత్తున నిర్మించడానికి కళాలయ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అను నూతన సంస్థ సన్నాహాలు చేస్తున్నారు. త్వరలో సెట్స్కు వెళ్లే ఈ చిత్రంలో రామపాత్రను రామారావు ధరిస్తారు. దర్శకత్వం: మానాపురం అప్పారావు

## ఫల్గుణా వారి జగత్ జెట్టీలు

ఈ నెల 12 న విడుదల కానున్న ఈ చిత్రంలో ఎస్. వి. రంగారావు, శోభన్ బాబు, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, చంద్రమోహన్, రాజబాబు, వాణిశ్రీ, విజయలలిత మొ॥ వారు నటించారు.

ఈ చిత్రానికి కథ: విజయబాపినీడు. స్క్రీన్ ప్లే, దర్శకత్వం, కె వి నందనరావు.

## మట్టిలో మాణిక్యం

చలం నిర్మిస్తున్న రెండవ చిత్రంలో జమున నాయికగా నటించబోతున్నది. ఆరు రీళ్ళు తయారయిన ఈ చిత్రానికి దర్శకుడు బి వి ప్రసాద్



రవిచిత్రవారి "పగసాధిస్తా"లో విజయలలిత

## బంగారు తల్లి

బాబు పిక్చర్స్ వారు 'మదర్ ఇండియా' ఆధారంగా తెలుగులో నిర్మిస్తున్న ఈ చిత్రం షూటింగ్ చాలా వరకూ పూర్తయింది. ప్రధాన పాత్రలను జమున, జగ్గయ్య, శోభన్బాబు, కృష్ణంరాజు, నాగభూషణం, అల్లురామలింగయ్య, పెన్మరాజై నిర్మల, రమాప్రభ మొ॥ వారు ధరిస్తున్నారు. ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకుడు. తాపీ చాణక్య దర్శకత్వం వహించే ఈ చిత్రానికి నిర్మాతలు పి హెచ్ హంబాబు ఎస్ శేషగిరిరావు



ఉత్తమ చిత్రవారి సాంఘికంలో నాగేశ్వరరావు, జమున.

## పూజకొద్దీ పురుషుడు

ఎస్. ఆర్. పుట్టన్న దర్శకత్వం వహించే ప్రొడ్యూసర్స్ కంబైన్స్ వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రానికి "పూజకొద్దీ పురుషుడు" అని నామకరణం చేశారు. వాణిశ్రీ స్త్రీపాత్రాభినయం చేస్తున్న ఈ చిత్రంలో కథానాయకుడుగా నాగేశ్వర రావు నటిస్తున్నారు.

ఎస్ వి రంగారావు గుమ్మడి నాగయ్య అల్లురామలింగయ్య సూర్య కాంతం యితర పాత్రలను ధరిస్తున్నారు

## మాధవీ ఆర్ట్ ప్రొడక్షన్స్

పి. సాంబశివరావు (అర్ధరాత్రి) దర్శకత్వంలో నిర్మాత ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు ఒక సాంఘిక చిత్రాన్ని ఆరంభిస్తున్నారు.

ఎస్ వి. ఆర్. శోభన్‌బాబు, కాంచన ప్రధాన పాత్రధారులు.

## 'ఇల్లాలు' నాగేశ్వరరావు

సవిత చిత్ర వారి "చిట్టి తల్లి"లో కె వి నాగేశ్వరరావు ప్రముఖ పాత్ర ధరిస్తున్నారు

జి కె మూర్తి దర్శకులు రచయిత



"శ్రీదేవి" చిత్రంలో కె. ఆర్. విజయ, హరనాథ్.

మహావిష్ణు పిక్చర్స్ "శ్రీదేవి"

పుట్టిన తొమ్మిది రోజులకే కన్నవారికి, తొమ్మిదేళ్ళకే పెంచిన వారికీ దూరమై, చివరకు కన్నతల్లిని చేరుకున్నా "అమ్మా" అని పిలిచే అదృష్టానికి నోచుకోని బాలిక జీవిత గాధ

కె. ఆర్. విజయ, హరనాథ్, గుమ్మడి సూర్యకాంతం, రాజబాబు, అల్లురామలింగయ్య, బేబీ రోజారమణి నటిస్తూన్న ఈ చిత్రానికి దర్శకుడు శ్రీ బి. ఎస్. నారాయణ. నిర్మాత శ్రీ ఆర్. ఎస్. నారాయణ



శ్రీ విజయరాణి కంబైన్సు వారి
"ఖడ్గవీర"లో కాంతారావు

## ఖడ్గవీర

చంద్రు సూర్యనారాయణ సమర్పించు 'విజయరాణి కంబైన్స్' వారి ఈ చిత్రంలో కథానాయకుడిగా కాంతారావు నటిస్తున్నారు. రాజశ్రీ, రాజబాల, చంద్రమోహన్, త్యాగరాజు, జ్యోతిలక్ష్మి ఇతర పాత్రలను ధరిస్తున్నారు. 11 న ఈ చిత్రం విడుదలవుతుంది

## మూగప్రేమ

స్త్రీకి ప్రేమించడం తప్ప, ద్వేషించడం తెలియదని చాటి చెప్పే సాంఘిక చిత్రం యిది. ఆత్రేయ రచన. వాణిశ్రీ, విజయలలిత, శోభన్‌బాబు, చలం, ప్రభాకరరెడ్డి మొ॥ వారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి దర్శకులు శ్రీ జి. రామినీడు. సంగీతం: చక్రవర్తి. ఛాయ: జి. కె. రాము, కళ: రాజేంద్రకుమార్, కూర్పు: అంకిరెడ్డి, నిర్మాతలు: నశీమ్ ఎంటర్‌ప్రైజెస్.



నశీం ఎంటర్‌ప్రైజెస్ వారి
"మూగప్రేమ"లో వాణిశ్రీ



రాజా పిక్చర్స్ వారి 'పత్రిక కంకణం''లో అనిత, కాంతారావ్

## జన్మ భూమి

టి. పి. ఎస్. పిక్చర్స్ నిర్మాత టి. పి. సుబ్బన్న నిర్మించే ఈ చిత్రంలో కాంతారావు. రాజనాల. రామకృష్ణ. సత్యనారాయణ, రాజశ్రీ. విజయలలిత, మొ॥ వారు నటిస్తున్నారు.

జి. విశ్వనాథం దర్శకత్వం వహించే ఈ చిత్రం ఈ నెలలోనే విడుదల కాగలదని తెలుస్తోంది

## నవశక్తివారి చిత్రం

నవశక్తి ప్రొడక్షన్స్ వారి ద్వితీయ సాంఘిక చిత్ర నిర్మాణం శరవేగంతో ముందుకు సాగుకోంది. ఇటీవలనే మదరాసులో షూటింగ్ ఆరంభం అయిన యీ చిత్రానికి యింతవరకు 8 రీళ్ళవరకు సిద్ధం అయింది. ఈ చిత్రానికి కథానాయకుడు శ్రీ ఎన్. టి. రామారావు.

ఇటీవలనే బొంబాయిలో ప్రముఖ సంగీత దర్శకులు శ్రీయుతులు శంకర్-జైకిషన్‌ల సారథ్యంలో ఆరు పాటల రికార్డింగ్ జరిగింది. ఈ ఆరు పాటలలో నాలుగు యుగళ గీతాలు. ఒక విషాద గీతం. ఒక 'కాబరే' వాయిద్యం సంగీతం వున్నాయి. వీటిని మన ప్రముఖ రచయిత శ్రీ ఆరుద్ర వ్రాశారు శ్రీయుతులు ఘంటసాల, హిందీగాయని శారద వీటిని పాడారు.

పద్మశ్రీ బిరుదును అందుకొన్న వెంటనే ఢిల్లీ నుంచి యీ పాటల రికార్డింగుకు గాను బొంబాయి విచ్చేసిన శ్రీ ఘంటసాల వారిని శ్రీ శంకర్ ఘనంగా సన్మానించారు.

సవ్యసమాజానికి. నాగరికతకు. మనస్సుకు. మనుశకు సంబంధించిన యీ చిత్రాన్ని ఆగస్టు నెలలో విడుదల చేయాలని నిర్మాతలు ఆశిస్తున్నారు. శ్రీ ఆరుద్ర శ్రీ కణ శ్రీల రచనతో, శ్రీ సత్యనారాయణ కెమెరా పనితనంతో. శరవేగంగా తయారవుతున్న యీ చిత్రానికి దర్శకులు శ్రీ పి ఎస్ రావు శ్రీ ఎల్ లింగశెట్టి సమర్పించే యీ చిత్రానికి నిర్మాతలు సారథి శ్రీ పి గంగాధర రావు



నటరాజన్ పిక్చర్స్‌వారి రెండవ చిత్రంలో రాజశ్రీ

## రామవిజేతావారి తల్లితండ్రులు

ఆప్తులూ, ఆత్మీయులూ ఎప్పుడయినా విడిపోయినా, తిరిగి కలుసుకొంటారనే సత్యాన్ని చాటి చెప్పే చిత్రం ఇది. శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి గారి "కౌసల్య" ఈ చిత్రానికి ఆధారం. ప్రముఖ తారాగణంతో నిర్మించే ఈ చిత్రానికి దర్శకుడు కె. బాబూరావు. నిర్మాత వారి సోదరుడు కె. ప్రభాకర్.

• • •

## ఆడజన్మ

విజయలక్ష్మి మూవీస్‌వారు నిర్మిస్తున్న చిత్రం ఆడజన్మ చాలావరకు పూర్తి అయింది గత నెల 28, 29, 30 తేదీలలో యీ చిత్రం తాలూకు అవుట్ డోర్ షూటింగ్ శ్రీశైలం వద్ద చిత్రీకరించారు.

శ్రీ ఐ. ఎస్. మూర్తి దర్శకత్వంలో నిర్మింపబడుతున్న యీ చిత్రంలో జమున హరనాధ్, నాగభూషణం, చంద్రమోహన్ రాజబాబు, సత్యనారాయణ, నాగయ్య, అల్లు రామలింగయ్య, విజయశ్రీ గీతాంజలి, మాలతి మొ॥గు వారు నటిస్తున్నారు. నిర్మాత: జి. వి. యస్. రాజు, మాటలు: భమిడిపాటి రాధాకృష్ణ, సంగీతం: వేణు.

• • •

మే రాత్రి 9.55 ని॥లకు షిరాజ్ కల్యాణ మండపంలో డి. వి. ఎస్. నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు తమ కుమార్తె సౌభాగ్యవతి లక్ష్మిని చిరంజీవి రామరాజుకిచ్చి వైభవంగా వివాహం జరిపారు. పరిశ్రమలోని ప్రముఖులందరూ విచ్చేసారు. శ్రీ ఎన్. టి. రామారావు అతిథులను కల్యాణ మండపానికి ఆహ్వానించారు. బాలమురళీకృష్ణ తన గాన కచేరితో విచ్చేసిన వారిని ముగ్ధులను చేసారు.

• • •

లక్ష్మీ ఫిల్మ్స్ భాగస్వాములలో ఒకరయిన శ్రీ చలసాని ఉమామహేశ్వరరావు (లక్ష్మబ్బాయి) తమ జ్యేష్ఠపుత్రిక సౌభాగ్యవతి రూపలక్ష్మిని గుడివాడ వాస్తవ్యులు శ్రీ వుప్పలపాటి వెంకట నరసింహారావు ప్రథమ పుత్రుడు చిరంజీవి శ్యామప్రసాద్‌కు ఇచ్చి 3వ తేదీ రాత్రి 10-34 ని॥లకు కృష్ణాజిల్లా రైస్ మిల్లర్స్ అసోసియేషన్ భవనంలో వైభవంగా వివాహం జరిపారు.

పరిశ్రమలోని ప్రముఖ నటీనటులు, విచ్చేసి వధూవరులను ఆశీర్వదించారు.

JYOTI * JUNE '70 Regd= NO.M 8669



